సంపాదకుడు

విశ్వసాహిత్యమాల.

ముంగండ

(Via) అంబాజీపేట

తూ. గో. జిల్లా.

రామమోహన్ ముద్రాక్షరశాల,

రాజమండ్రి.

వెల ౪ అణాలు.

# ముమ్మాటికి!!!

ఒకజాతి అభివృద్ధి పొందాలి అంటే పూర్వకాలంలో ప్రపంచం ఆప్రయత్నంలో పొందిన అనుభవాలని తెలుసుకోవలసిన అవసరం ముఖ్యముగావుంది. లేకపోతే "పునరపి జననం - పునరపి మరణం" అన్నట్లు, చేసినతప్పేచేస్తూ, తగిలిన దెబ్బేతగుల్చుకుంటూ, చిన్న సున్నలోగుడిగుంచం ఆడుతూ ఉండవలసివస్తుంది.

వినియోగం విషయంలో ఏలాగునున్నా ప్రపంచంలో పుస్తకాలు పుట్టడానికి కారణం అదే! చరిత్రలు కథలుగా చదువుకొని కాలక్షేపంచేయడానికి కాదు. శాస్త్రాలు వారి వారి పూర్వుల ఔన్నత్యంచెప్పుకొని చంకలుకొట్టుకొనడానికి కాదు.

పరిణామశీలమైన ప్రపంచంలో ఏ జీవీ కాలానుగుణ్యమైన మార్పుపొందకపోతే ధ్వంసంకాకతీరదు. ఆధునిక యంత్రమహాయుగంలో, శిలాయుగంనాటి ఆచారాలు— అభిప్రాయాలు కలిగిఉన్న జాతి అవస్థనిగూర్చి చెప్పాలా? అజ్ఞానంచేతగాని – అభిమానంచేతగాని ఆధునికయుగాన్ని అర్థంచేసుకోలేని దోషం ఎవ్వరిది?—

గతించిన కొన్ని వేల సంవత్సరాలనుంచీ ప్రపంచం పొందిన పరిణామం—అనుభవం—వివరిస్తూ, భవిష్యత్తు నిర్మించడానికి తావిచ్చేవే సజీవమైన— శాస్త్రాలు—చరిత్రలు! ఒకశాస్త్రం పూర్తియిందన్నా, ఒకజాతి చరిత్ర ఇంతేనన్నా ఆయావస్తువులు ప్రపంచంలోంచి ఎగిరిపోయినాయన్నమాట అది బ్రతికియున్న వాళ్ళకి—బ్రదుకదలచుకున్నవాళ్లకి ఆచరణలో ఉపయోగించేది కాదని అర్థం!!

ఎన్నియుగాలు గడిచినా, ఏ వేల సంవత్సరాలనాటి వ్యక్తుల శేషాలనో త్రవ్వితీసి, వాళ్ళకోసం కన్నీరు కార్చడంలో ప్రపంచగమనం మరచిపోవడం కంటె ఆత్మహత్య అంటే వేరేలేదు!

ఏ దేశం చరిత్రనైనా, ఏజాతి అనుభవాలైనా, ప్రతి మనిషీ తన భవిష్యన్నిర్మాణంకోసం, అనుభవం సంపాదించడంలో ఉపయోగించుకోవలసిందే కాని వానికంతకంటె ప్రాముఖ్యం ఈయకూడదు. దేశములయొక్క శత్రుత్వ—మిత్రత్వాలనిబట్టి వానికి ప్రాధాన్యం ఈయకూడదు. ఈవిషయంలో తన పరభేదాలకి తావిచ్చేజాతి ఇంకా పతితం కాక తీరదు.!!!

ఆంధ్రజాతి తన పునర్నిర్మాణ ప్రయత్నంలో ప్రపంచ చరిత్రకేసి తిరిగి చూడడం ముఖ్యం ప్రపంచంలో ప్రతీజాతీ దిన

దినంఅభివృద్ధిపొందడానికి ప్రయత్నంచేస్తూనేఉంది. కాని అభి వృద్ధిని పొందగలిగినవి చాలా స్వల్పం. ఆంధ్రజాతి అధిక సంఖ్యాకులలో చేరకుండాలంటే వాటిగమనంపరిశీలించడం ముఖ్యం!

ప్రపంచజాతులలో చాలాముందుకు పోబోయి వందల కొలదీ సంవత్సరాలు వెనక్కిపోయిన వాట్లలో ఇటలీ ఒకటి. ఏనాటికానాడే స్వార్థపరులైన నాయకులయుందలి నమ్మకంచేత పెట్టిన ప్రతిఅడుగులోను బోల్తాకొట్టింది.

తరుచుతరుచుగా దెబ్బలుతింటూనా్న, మళ్ళీ పతన ప్రయత్నమే ఇటలీ ఎందుకు చేస్తూందో తెలుకోవాలంటే, ఆదేశములోని పరిస్థితులు-ప్రజలమానసికవృత్తులు-ఆదేశం మీద పరిసరప్రదేశాలయొక్క ప్రభావంగుర్తించవలసియుం టుంది. దేశాటనంయొక్క ఉద్దేశ్యంకుక్క సంతకివెళ్ళివచ్చి నట్లు, పోయివచ్చేటందుకుగాదు. కేవలం అనుభవసంపాదన కొఱకు. కొంతవరకు వినోదంకొఱకూను.

ప్రతివారూ దేశదేశాలు తిరిగి రావడం సంభవం కాదు. కనక తిరిగివచ్చినవారు చెప్పినవిషయాలే తెలు కోవడంఅవసరం.

ఇతరజాతులన్ని తమతమ భాషలలో ఈ మాదిరి గ్రంథాలు మిక్కిలి ప్రచారంలోకి తెచ్చి, ప్రజలదృష్టికి ప్రపంచగోళం ప్రత్యక్షంచేశాయి. కాని ఒక్క ఆంధ్రజాతి—!

ఆంధ్రులు నేడు తమ జాతీయ నిర్మాణ ప్రయత్నములలో విఫలులుకాకుండా ఉండాలంటే "ఇతరజాతుల" సాంఘిక రాజకీయ చరిత్రలు తెలుసుకోవడం ముఖ్యం! — నేడుమనకి శివాజీ శీతారామరాజుల యుద్ధకథలకంటె ఈ మాదిరి గ్రంథాలు చదవవలసిన అవసరం — అగత్యం అధికంగాఉందని మాఆశయం!

# విశ్వసాహిత్యమాలా

## ప్ర ధా న పో ష కు లు.

మహారాజశ్రీ చెలికాని వెంకటరమణమూర్తిగారు.

మేనేజరు దేవస్థానం ఆ॥ అన్నవరం.

## పో ష కు లు.

,, నిట్టల శ్రీరామకృష్ణమూర్తిగారు, తాణేలంక.

,, ఖండవల్లి సుబ్బారాయుడుగారు, ముంగండ.

,, గోవిందవజ్ఝుల వెంకట్రామశర్మగారు, ముంగండ.

,, పళ్ల పెరుమాళ్లుగారు, తాణేలంక.

,, సోమయాజుల రామనాధంగారు, ఇసుకపూడి.

,, చేదమంగయ్య పంతులుగారు, తొండంగి.

,, వడలి జోగయ్యశాస్త్రిగారు, గంగలకుర్రు.

,, బాలాంత్రపు వెంకట్రావుగారు,

పెట్రోల్ డిపో సూపరింటెండెంటు హైద్రాబాదు

,, రోళ్ల సీతారామస్వామిగారు, కాకినాడ.

మహారాజశ్రీ దువ్వూరి వెంకటపతి సోమయాజులుగారు,
Son of Jabdatul, Yakaran, Sri D
Suryanarayana Somayajulu garu,
Baphiat, Bashand, Zamindar,
Mukkamala, గంగలకుర్రు.

,, కళా వెంకట్రావుగారు, అమలాపురం.

సహాయులు.

,, మంత్రవాది సుబ్బారాయుడుగారు, ముంగండ.

,, కురసాల గానులుగారు, పంచాయతీబోర్డు ప్రెసిడెంటు, ఇసుకపూడి.

,, డాక్టరు, పెద్దాడ రామమూర్తిగారు, అమలాపురం.

,, వాడ్రేవు జగ్గరాజుగారు, గంగలకుర్రు.

మాగ్రంథమాల ద్వితీయపుష్పము నకాలములో వెలువడుటకు సహాయమొనరించిన ఉదారులైన మిత్రవర్యులందరకు మాయభివందనములు.

సంపాదకుడు.

## నామాట—

పుస్తకం బాగోగులు మంచిచెడ్డలూ నిర్ణయించుకొనే భారం పాఠకులది.

ఎవరేపుస్తకం వ్రాసినా దానివలన జనసామాన్యాని కేదో నూతనవిషయం తెలుపుడు చేయడం, భాషకొక క్రొత్త అలంకారం కల్పించడం ఉద్దేశ్యంతోటే వ్రాస్తాడు.

ఆపుస్తకం విషయంలో అనేక మందికి అనేక అభిప్రాయ భేదాలుండవచ్చు! వాటన్నిటికీ సమన్వయం కుదర్చడంకష్టం. సమన్వయంకుదర్చబోవడం గ్రంధకర్త తెలివి తక్కువదనం—

ఈపుస్తకం ఆంధ్రలోకానికి కొద్దిగానైనా సేవచేయ గలదని నా ఆశ!

ఆ ఆశతోటే నాకీగ్రంధరచనంలో సహాయంచేసిన నామిత్రులు జగన్మోహన్‌గారికి నాకృతజ్ఞత.

గ్రంధకర్త

# విషయసూచిక.

# ఇటలీ

సిసిలీ, సార్డీనియా ద్వీపములును, మహాయుద్ధానంతరము కలసిన ట్రెంటినో, గొరీజియా, గ్రాడిస్కా, ఆల్టో, అడీజ్, కార్నియోలా, ట్రీట్సీ, ఇస్ట్రియాలతోను ప్రస్తుత ఇటలీ యేర్పడెను. మొత్తపు దేశవైశాల్యము 118,130 చదరపు మైళ్లు. జనసంఖ్య 40,070,000. హిందూ దేశమునకువలెనే ఇటలీకికూడ ఉత్తరమున పెట్టనిగోడవలె ఆల్ప్సు పర్వత శ్రేణులు, మిగిలిన మూడువైపులందు మహాసముద్రములు వ్యాపించి, స్వరక్షణమునకు ప్రకృతి సాధనములుగ నున్నను, చిరకాలము పరాధీనతకు పాల్పడినది. హిందూదేశమునకు వలెనే, దీనికి కూడ చాల పురాతనమైన నాగరికత, చరిత్ర గలవు. ఒకప్పుడు రోమను సామ్రాజ్యము యూరపంతయు వ్యాపించి యుండెడిది. ప్రస్తుతయూరపు ఖండనాగరికత ఇటలీ యందే జన్మించెను.

ఇటలీ చాల పురాతన నాగరికత కలిగియుండుటచేతను, అచ్చటి ప్రకృతియు, వాతావరణము, ఎటువంటివారికైనను ఆహ్లాదకరముగ నుండుటచేతను, యూరపు ప్రజలకు యాత్రా

స్థలమైనది. ప్రతిసంవత్సరము ఇటలీలో ప్రాకృతిక సౌంద ర్యము చూచి యానందించుటకు వచ్చి పోవు విదేశీయుల సంఖ్య విపరీతముగా నుండును.

## ఆల్ప్సు పర్వతములలో

యూరపుఖండ మంతటిలోను, ఇటలీ దేశము చాల రమ్యమైనది. ఈరోజులలో నెవరైన మెట్టుమార్గమున ఇటలీ పోవలె ననిన, ఆల్ప్సు పర్వతశ్రేణులందు కొట్టబడిన సొరంగ ములగుండా పోవు రైలునెక్కి, అతిసునాయాసముగా పో వచ్చును. కాని పూర్వము ఇటలీకి పోవుట బహుకష్టముగా నుండెడిది. అప్పటి ప్రయాణీకులు ఫ్రాన్సునుండియో స్విడ్జ ర్లాండు నుండియో బయలుదేరి, ఆల్ప్సు పర్వతములమీదుగా, వంకర టింకరగా, బహుశీతలమైన యెత్తుప్రదేశములగుండా, పోవురోడ్లమీదుగా, ఇటలీదేశపు బయళ్లలోనికి దిగెడివారు.

ఇటలీకి పోవుటకప్పు డదియే సరియైన మార్గము. ఇటలీకి పెట్టనిగోడలగు ఆల్ప్సుపర్వతశ్రేణులందు, రైల్వే యింజనీర్లు దారులుకొట్టి రైలుమార్గము వేయకపూర్వము, ప్రయాణీకులందరును, పైనచెప్పిన కొండబాట మీదుగనే ఇటలీకి పోవలసియుండెను. కాని యిప్పుడుకూడ పూర్వపు కొండ బాటమీదుగా పోవుప్రజలు గలరు. మోటారు కని

పెట్టబడిన తరువాత, చాలమంది ఈపురాతనమార్గము మీదుగా పోవుచున్నారు. రోడ్డుప్రక్క కర్షకుల పల్లెలుండుట చేతను, సర్వకాల సర్వావస్థలయందును జనప్రవాహ మా దారిని పోవుచుండుటచేతను, ఈమార్గ మేకాంతమనిపించదు. ఇటలీ దేశపు పనివారలు, పళ్లెలు తిరిగి అమ్ముకొని జీవించు చిన్నచిన్న వర్తకులు, మొదలగు సామాన్యజనులు చవకగా నుండు ఈమార్గము మీదుగానే పోవుదురు.

వేసవికాలములో ఈఆల్ప్సు పర్వతమార్గముగుండా పోవుట అతిఆనందదాయకముగా నుండును. స్విడ్జర్లాండు నుండి ఇటలీకి వచ్చునప్పుడు, బండియైనను, మోటారైనను పర్వతపు వరకముల మీదుగా సునాయాసముగా పోవునటులు నిర్మింపబడిన రోడ్డుగుండా నెమ్మదిగా పోవును. పైకి పోవు కొలది గాలి చాలచల్లగా నుండును. మంచుచే కప్పబడిన మార్గము:మీదుగా బండి చక్రములు మంచును నలగకొట్టు కొనుచు పోవును. చలికాలమున ప్రయాణీకులు, కోట్లు, శాలువలు మున్నగునవి కప్పుకొందురు.

ఇచ్చట మంచు మీద పాతబడిన స్తంభముల మూలమున దారి తెలియుననగును. పైన కొండప్రక్కలనుండి వ్రేలాడు చుండు పెద్దపెద్ద మంచుగడ్డలు కనపడుచుండును. అప్పుడప్పుడవి జారి పడుచుండుటచే, ఈమార్గము గుండా పోవువారికి చాల అపాయము సంభవించుచుండును. వేసవికాలమందు పెద్ద

పెద్ద మంచుకొండలు పట్టువదలి క్రిందకు పడునప్పుడు, ఎదుట నుండు మహావృక్షములు, బండలు మొదలైనవన్నియు పిండిపిండి యై, అవి జారినంతప్రదేశము పెద్ద లోయవలెనేర్పడును.

బాటసారు లీదారిని ప్రయాణము చేయగా చేయగా, చివరకు అతియెత్తైన ప్రదేశము చేరుకొందురు. అచ్చటినుండి పర్వతములయొక్క రెండవతట్టున నున్న ఇటలీ దేశము కాన నగును. ఆకాశ మతినిర్మలముగా నున్నరోజున అచ్చట ప్రకృతి సౌందర్యము దర్శనీయముగా నుండును. ఆల్ప్సు పర్వతశ్రేణులమీద స్విడ్జర్లాండునుంచి ఇటలీకి వచ్చు మార్గము మీదనున్న స్ప్లైజన్‌లోయ దాటునపుడు అతి అందమైన దృశ్యములను గాంచనగును. పోనుపోను చిన్నవై లొంబార్డి మైదానములో లీనమైన ఆల్ప్సుపర్వతశ్రేణులు, బహు దూరము వ్యాపించి ఆకాశపు నీలిరంగులో లీనమైన లొంబార్డి మైదానము, కాన్పించును.

ఈయెత్తు ప్రదేశమునుంచి దిగుట ప్రారంభించి పోయిన కొలది మంచు తగ్గి దారి మామూలు రాతి ప్రదేశముగుండా పోవును. ఎత్తునుంచి పల్లమునకు పోవుట గావున శకటము లతి వేగముగా పోవును. అంతకంతకు చలి తగ్గును. అచ్చటచ్చట వృక్షచ్ఛాయలందు కృషికుల యిండ్లు కానవగును. క్రమ ముగా మంచువలె శీతలముగా నున్న గాలి వేడిగాలిగా మారును. యుద్ధసమయములలో ఆల్ప్సుపర్వతములమీద

సైన్యములను తీసుకొని పోవుటకు 'టెలిఫెరికా' అనే యంత్రము నుపయోగింతురు. పర్వతములలో నక్కడక్కడ కొన్నికొన్ని మజలీలు కట్టుదురు. క్రిందనుండి ఆ మజిలీలవరకు బలమైన తీగలతో చేయబడిన పగ్గము లుండును. బలమైన యంత్రములచే నడుపబడు పెట్టెలు ఈతీగెలనుండి వ్రేలాడుచుండును. మనుష్యులు ఆహారపదార్థములు ఈపెట్టెలమూలముననే పర్వతములమీదికి చేర్చుదురు. ఈపెట్టెలలో యిద్దరు కూర్చుండుటకు తావుండును. ఇట్టి యెత్తుప్రదేశములలో పనిచేయుటకు పర్వతేయులనే నియమింతురు.

మైదానములలో నివసించువారు అక్కడ ఉండలేరు. అక్కడ చలి, మంచు, గాలి, చాల రోగములు కలుగ చేయును. కాని కొండజాతివారు యేబదివత్సరములవారు కూడ సునాయాసముగా నిట్రములైన పర్వతముల నతిసాహసముతోను, లాఘవముగాను, యెక్కగలరు. వారాకొండలమీద అవలీలగా దుముకుచు పరుగెత్తగలరు. సమదేశీయులు వారట్టి పనిచేయుచుండగా చూడనైన చూడజాలరు. పర్వతములపై అచ్చటచ్చట కొయ్యలు పాతబడి వాటికి బల్లలు కట్టబడి యుండును. వాటిమీద 'మంచుకొండలు జారుతవి. జాగ్రత్త' అని వ్రాయబడియుండును. ఆకొండలలో నివసించువారు వానిని లెక్కచేయరు. తరుచుగా పటాలములకు పటాలములు ఆమంచుకొండలలో తుడిచిపెట్టుకొని పోవుచుండును.

# ఇటలీదేశపు సరస్తీరాన.

స్ప్లుజెన్ లోయనుండి క్రిందకు దిగి ప్రయాణీకుడు కామోసరస్తీరమును చేరుకొనును. ఇటలీదేశమందలి సరస్సులు గల ప్రదేశమిదియే. ఈకామోసరస్తీర ప్రదేశములను ప్రకృతి అనేకవిధముల అలంకరించినది. లాంబార్డీసీమకు ఉద్యానవన మని దీనికి సార్థకనామము గలదు. యూరపు ఖండమందలి అన్నిదేశములనుండి చాలమంది జనులు ఈసరోవరప్రాంతముల నివసించుటకు వచ్చుచుందురు.

ఈకామోసరస్సు సన్నముగా పొడవుగా నుండి కొండ చరియలలోనికి చొరుచుకొనిపోయిన ఉపశాఖలుగలిగి యున్నది. ఎత్తైన మహాపర్వతములే గట్లుగా గలిగి, బహుదూరము వ్యాపించి ఆకాశమువలె నీలిరంగుగా నున్న నీటితోను, అందమగు తీరప్రదేశమున కట్టబడిన పట్టణములతోను, చిన్న పల్లెలతోను ఈ కామోసరోవరప్రాంతము అతి ఆకర్షణీయముగా నుండును.

సరోవరతీరమునకు పోవురోడ్డు, గ్రామములు, ద్రాక్షతోటలు, చిట్టడవులగుండా మలుపులు తిరిగి, ప్రతిమలుపువద్ద బాటసారిని క్రొత్తక్రొత్త ప్రకృతివైచిత్ర్యములతో ముగ్ధుని గావించును.

ఈసరస్సునందు ప్రయాణము చేయునప్పుడు తీరము నొరసియుండు నీలి నీరములు, తీరముననున్న మైదానములు, తోటలు, కొండ లోయలందలి ద్రాక్షతోటలు, గ్రామములు, వీటిపైన ఘంటానాదము లు వినబడు క్రైస్తవ దేవాలయములు, ఇంకను పైకి చూచిన యెక్కుటకు వీలులేని మహాపర్వతములు, వాటిపైన మంచుతో కప్పబడియున్న శిఖరములు, గలిగిన ఈదృశ్యము నిలకడలేక ఎండగా నున్నప్పు డొక మాదిరిగాను, వర్షము కురియునప్పు డొక విధముగాను, ఉదయ మొకరీతిగాను, మధ్యాహ్న మొకరీతిగాను, వేరువేరు వర్ణము లతో క్రొత్తక్రొత్త భావము లుద్భవింపచేసి, ఎంతసేపుచూచినను తనివితీరక సంతోషదాయకము గా నుండును.

కామోసర స్తీరము గొప్పగొప్ప భవనములతోను, కాఫీ హోటళ్లతోను, పడవలసమూహములతోను, వాటి వద్ద, చూచుటకు వచ్చు జనులను తమతమ పడవలమీద తీసుకొనపోవుటకు అత్యాతురతతో నున్న చురుకైన పల్లె వాండ్రతోను, నిండియుండును. సామాన్యముగా యిచ్చటి పల్లెవాండ్రు పగలు ప్రయాణీకులను తీసుకొనిపోయి, రాత్రు లందు రహస్య వ్యాపారము చేయుచుందురు.

ఈ రహస్య వ్యాపారమునకు కారణము ఈదేశము లోనికి వచ్చు సరకులపై అత్యధికమగు పన్ను విధించుటయే. అన్ని దేశములలోను భోగపదార్థములపై యెక్కువ పన్ను

విధించు చుండ, ఈదేశములో ప్రజలందరికిని అత్యావశ్యకమగు వస్తువులపై కూడ యెక్కువ సుంకము విధింతురు. ఇటలీలోని ప్రతిగ్రామము, పట్టణములోను, 'పొగాకు, ఉప్పు, స్టాంపులు' అమ్మబడునని వ్రాయబడిన బోర్డులను చూడగలము. ఉప్పుమీద పన్ను వేయుటచేత మనుష్యులే గాక పశువులుగూడ బాధనొందుచున్నవి. పంచదార పైన కూడ పన్ను ఉన్నది. ఈపన్నులఫలితముగా మోసము లెక్కువ.

సారా షాపులపై పన్ను తప్పించుకొనుటకై, బల్లపై నల్లని, తెల్లని, బంతులను వ్రాసి వీధులలో కట్టెదరు. దీనికి అర్థము యిచ్చట నల్లని తెల్లని సారా యమ్మబడునని.

ఇటలీదేశపు సరిహద్దు లన్నియు ఇతరదేశములనుండి వచ్చు సరకులమీద సుంకము విధించు కార్యస్థానములతో నిండి యుండును.

ప్రభుత్వము విధించు పన్నులమూలమున ఇటలీలో పెట్రోలు ధర చాల హెచ్చుగానుండుటచేత కొనలేక బీదలు సాధారణముగా సూర్యాస్తమయముతోనే నిద్రింతురు. ఇటలీలో పెట్రోలింత గగనకుసుమమవగా ప్రక్కనున్న స్విట్జర్లాండులో పెట్రోలు చాల చవుక.

ప్రక్కనున్న దేశములలో చవకగా నున్న సరుకులన్నియు, ఇటలీకి వచ్చినవాటికన్నను, ఇటలీలో తయారగు వాటికన్నను చవుకయగుటచే రహస్య వ్యాపారమునకు

ప్రోత్సాహము కలిగినది. అర్ధరాత్రములందు ఇటలీ సరిహద్దు లందలి ఏకాంతమార్గములగుండా, ఇతరదేశములందు సరకు లను చవుకగా కొని, కామోసరస్సునందలి అతిరహస్య ప్రదేశములకు తీసుకువత్తురు. అక్కడ త్వరితముగా నడుపబడు పడవలలో నెక్కించి, రహస్యముగా ఇతరప్రదేశములకు తీసుకొనిపోయి, ఆప్రాంతములలో, ఇటలీదేశపు ధరలో సగము ధరకు అమ్ముచుందురు. చవుక యగుటచే కొనువారు చాలమంది యుందురు.

ఈ వ్యాపారమును మాన్పుటకు ప్రభుత్వ మనేక విధముల ప్రయత్నించుచున్నది. రహస్యవ్యాపారస్తులను పట్టుకొనుటకు టార్పెడో పడవలు రాత్రింబగళ్లు కామో సరస్సునందు తిరుగుచుండును. ఈటార్పెడోపడవలెగాక అయి దుగురు బలిష్టులైన పల్లెవాండ్రచే నడుపబడు పడవలమీద తమ ఉద్యోగులను నియమించి రాత్రి బగళ్లు సరస్సుయొక్క ప్రతిమూరుమూలలను, తిరిగి చూచుచుండునట్లుత్తరువు లిచ్చిరి. ఇవిగాక కాంతివంతములైన మెరుపు దీపములను ఉన్నత ప్రదేశములందుంచి, అనుమానముగనున్న పడవలమీదకు ప్రసరింపచేసి రహస్యవ్యాపారస్తులను పట్టుకొనుచుందురు. అన్నివిధముల వేయి కళ్లతో చూచుచున్నను, ప్రభుత్వము రహస్యవ్యాపారము నాపలేకున్నది. ప్రభుత్వోద్యోగులంద రును లంచగొండులగుటయే దీనికి కారణము.

కామోసరస్సుతీరముననున్న భవనములలోకెల్ల 'ప్లినీ' భవనము చాల అందమైనది. ఈభవనము ముందువైపు తటతట గాలిచే కొట్టుకొను సరస్సు నీటిచేతను, వెనుకవైపు చెట్లచే కప్పబడిన గొప్ప పర్వతపంక్తులచేతను, ఆవరింపబడియున్నది. ఈభవనమునకు సాధారణముగా యెన్నడును సూర్యరస్మియే తగులదు. మండువేసవిలో మాత్రము భవనముయొక్క ముందుభాగమునకు కొన్ని గంటలకాలము ఎండ తగులును. ఇది సంవత్సరములో కొన్ని వారములు మాత్రము దాస యోగ్యముగానుండి మిగత సమయములందు అతిశీతలముగా నుండును.

ఇచ్చటనే పర్వతములలో ఒక జలదార పుట్టి క్రిందకు ప్రవహించి, చివరకు గదివలెనున్న ఒక స్థలములోనికి వచ్చును అది అక్కడ కొంతసేపు ఆగి ఆగది నిండగానే మరల కామోసరస్సులోనికి ప్రవహించును. ఆకొండధారయొక్క ప్రకృతి అత్యద్భుతము. ప్రతిదినము మూడుసార్లు నీరు పొంగి మూడు పర్యాయములు తీసిపోవును. పోటు పోటులు బాగుగా కనుపించి చూచుట కింపుగా నుండును.

దీనికి కొన్నిమైళ్లదూరములో పాలధార యను అద్భుతమైన జలధార గలదు. పాలవలె తెల్లగా నుండు ఈ ధార కొండలలో పుట్టి క్రిందకు ప్రవహించును. దీనికికూడ పోటు పాటులు గలవు. కాని ప్లినీ జలధారకువలె క్రమముగా లేవు.

ఒకరోజున జలధార చాల పోటుగానుండి, మరియొకరోజున పాటుగానుండి, ఇంకొకరోజున ఇంచుమించుగా యెండిపోవును. ఈజలధార దగ్గరకు వెళ్లవలెననిన వారెన్నా యను పట్టణము మీాదుగా వెళ్లవలెను.

## లాంబార్డీ మైదానములో

ఆల్ప్సుపర్వతములు దిగినంతనుండి లంబార్డీమైదానమే యైనను, ఆమైదానము యొక్క సుందరదృశ్యము కామో సరస్సు దాటినగాని అనుభవమునకు రాదు. ఆల్ప్సుపర్వతములకును, ఏడ్రియాటిక్ సముద్రమునకును నడుమనున్న లంబార్డీ మైదానము వందలకొలది నదులతోను, తోటలతోను నిండి భూలోకస్వర్గమువలె నుండును. ఈ లంబార్డీమైదానము ఇటలీలోకెల్ల అతిఫలవంతమును, ధనవంతమునునై వర్ధిల్లుచున్నది. దీనికి దక్షిణమున నున్న అన్నిరాష్ట్రములకంటెను, యిచ్చటనే వ్యవసాయము మంచి అభివృద్ధిలో నున్నది. ఇచ్చట జనులందరును చురుకుగలవారై, పూర్వమొక్కవర్తకమున పేరుగాంచిన వీరు ఇప్పుడన్నివిధముల యభివృద్ధి నొందుచున్నారు.

లంబార్డీమైదానమందలి ముఖ్యపట్టణము మిలన్ నగరము. ఇది 660,000 జనసంఖ్యగలిగి చాల అందముగా నుండును. పాలరాతితో నిర్మింపబడి అపూర్వశిల్పనైపుణ్యమును ప్రదర్శించు 'డ్యూమో' (Duomo) అను చర్చిమిలన్ యొక్క అందము నతిశయింపచేయును. అతినిర్మలముగానున్న దినమునచర్చియొక్క గోపురముమీద నిలువబడి, ఆల్ప్స

పర్వతములను చూచిన వర్ణింపశక్యము కానిదియు, మనస్సునందు చిరస్థాయిగా నాటునదియు నగుదృశ్యము కాననగును. ఎండలో వెండివలె మెరయుచుండు రోజా, జెక్‌మాట్, శిఖరములున్ను, వాటి వెనుకనుండి కాననగుబెర్నిన్, ఓబర్‌లాండ్ శిఖరములున్ను, లంబార్డీమైదానము, తెల్లగా కాననగు అందలి పట్టణములు గ్రామములు మొదలైనవి దర్శనీయములై యుండును.

మిలన్ ప్రజలను గర్వితులనుగా చేయు 'లాస్కాలా' యను భవనమునందు, గొప్ప గానకచేరీలు, నాటకములు, వందలకొలది సంవత్సరములనుండి జరుగుచున్నవి. ఎంతగొప్ప పండితుడైనను ఒక్కపర్యాయమైనను, లాస్కాలాయందు తన విద్యను ప్రదర్శించినగాని ఉత్తీర్ణుడైనట్లు తలచెడివాడు కాడు. లాస్కాలా స్థాపింపనిపూర్వముకూడ మిలన్‌నందు సంగీతము వృద్ధిలోనుండెడిది.

మిలన్‌పట్టణము వదలి వచ్చునపుడు రోడ్డుప్రక్కన కృషికులయొక్క ఇండ్లు పొలములలో చురుకుగా పనిచేయుచున్న ఇటలీ దేశపు పనివాండ్రు చుట్టుప్రక్కల మల్బరీవృక్షముల సమూహములు కాననగును. ఈ మల్బరీవృక్షముల ఆకులచే పట్టుపురుగులను పెంచుట లొంబర్డీమైదానమందొక ముఖ్యపరిశ్రమ. కాని 50 సం॥కు పూర్వము ఒక రోగము మూలమున పట్టుపురుగులు మల్బరీవృక్షములు కూడ చని

పోయినవి. ప్రస్తుతము ఈపరిశ్రమ కొద్దికొద్దిగా అభివృద్ది లోనికి వచ్చుచున్నది. కాని ఈవ్యాపారము మూలమున పూర్వమున్నంత లబ్దిలేదు.

ఒకవిధమైన రోగము మూలమున లంబార్డీమైదాన మందలి ద్రాక్షతోట లన్నియు, నశించి కృషికులకు మరి యొక నష్టము గల్గెను. కాని యిప్పుడు మేలుజాతి ద్రాక్ష మొక్కలను పాతి ద్రాక్షసారాయి వ్యాపారమును అభివృద్ధి గావించుకొనుచున్నారు.

వీటి అన్నిటికన్న లంబార్డీమైదానమునం దెక్కువ నష్టమును కలిగించునది మంచువాన. వేసవికాలములో సస్య ములు బాగుగా పెరుగుచు, మంచి పంట పండునని ప్రజలు సంతోషించునపుడు ఒక పెద్ద నల్లమబ్బు ఆకాశమున కనబడి కొద్దికాలములో ఉరుములు మెరుపులతో మంచుముక్కల వాన కురియును. ఈవాన 10-15 నిముషములలో సస్యముల నన్నిటిని పడగొట్టి చాల నష్టము కలిగించును. ఈవిధముగా నష్టము కలుగుట సర్వసాధారణము. కాని ప్రస్తుతపు శాస్త్ర జ్ఞులు కొత్తరకపు ఫిరంగులు కనిపెట్టి, వాటిని మందుతో దట్టించి, ఈమబ్బులు కనపడినపుడు ఫిరంగులచే వాటిని చెల్లా చెదరుచేసి, సస్యములను వాటిబారినుండి కాపాడుచున్నారు. ఈఫిరంగులు పేల్చినప్పుడు మంచు పెద్దముక్కవలె పడక పిండివలెపడును. ఈప్రాంతముల కెవరైన కొత్తవారు వచ్చిన,

ఈ ఫిరంగుల చప్పుడు విని, యుద్ధభూమియందుంటిమని భ్రాంతి నొందుదురు.

లంబార్డీ కృషికులు ఉదయమున జొన్నపిండితో తయారుచేయబడిన భోజనముచేసి, మధ్యాహ్నము బియ్యముతో వండిన పదార్థములే బేజీలుతిందురు. మాంసము, గ్రుడ్లు, ఎండుచేపలు మొదలగునవి పండుగరోజులలో మాత్రము తిందురు. వారు పాములు, కప్పలు మొదలైన వానికొరకు పొలములు, గుప్పలు తరచు వెదకుచుందురు.

లంబార్డీనుండి తూర్పునకు పోవు రైలునెక్కి మైదానములగుండా పోయిన చివరకు రెల్లుగడ్డిచే నావరింపబడిన చిన్న సరసులు, గుంటలచే నావరింపబడిన చిత్తడిప్రదేశము చేరుకొందుము. అక్కడికి ఏడ్రియాటిక్ సముద్రము యెదురుగా కానిపించుచుండును. కొంతదూరమున ఈ సముద్రములో కట్టబడినవా యనునట్లు కాన్పించు బురుజులు, ఘంటస్తంభములు, గొప్పగొప్పభవనములు, క్రైస్తవదేవాలయములు కానవగును. ఇదియే అత్యద్భుతమైన వెనిస్ నగరము.

ఈ వెనిసునగరరాజము వందలకొలది చిన్నద్వీపములపై నిర్మింపబడి ఏడ్రియాటిక్ సముద్రమునకు తిలకమైయున్నది. పురాతన కాలమునుండియు జినోవాతో మధ్యధరాసముద్రాధిపత్యమునకై జినోవాతో పోటీ చేయుచున్నది. ఈనగరము చిత్తడిప్రదేశమందు చేవగల దూలములపై నిర్మిం

పబడి వీథులకు బదులుగా కాలువలతో మనోహరముగా నుండును. రెండువైపులందు ఆకాశమునంటు మేడలచే నావరింపబడిన ఈకాలువలందు మధ్యాహ్నము చాలచల్లగా నుండును. పడవలతెడ్డు చప్పుళ్లును ఈపడవలను నడుపు గండోలియరుల పాటలును తప్ప మరి యేధ్వనియు వినబడదు.

ప్రస్తుత మీనగరము నిలిచియున్న స్థలము పదునైదు శతాబ్దముల క్రిందట మానవు డడుగిడుటకైన వీలులేకుండ నుండు నొకబురదనేల. పూర్వము లంబార్డీమైదానము మీదికి ఉత్తరమునుండి విదేశీయులు దాడివెడలి ప్రజలను చంపి పట్టణములు, గ్రామములు కొల్లగొనిరి. వారిధాటి కాగలేక అనేకులు లోబడిరి. కాని వెనిటి యను నొక తెగవారు తమస్వాతంత్ర్యమును నిలువబెట్టుకొననెంచి సముద్రప్రాంతములకు పారిపోయి, అచ్చట శత్రువులు సులభముగా దాటలేని సముద్రపు పాయలను దాటి సమీపమున పిడోనది యొడ్డుననున్న యొకచిత్తడినేలను తమ నివాసస్థానముగా నేర్పరచుకొనిరి. అచ్చట వారు తీగలు మట్టి మొదలగువానితో కుటీరములను నిర్మించుకొనిరి. అచ్చట వారు చేపలు పట్టుకొని సుఖముగా జీవయాత్ర చేయుచు, కొలదికాలములో నౌకాయానమునందు కౌశలముగలవారై, చేపల వ్యాపారము చేయ మొదలిడిరి.

క్రమముగా కొంతకాలమునకు వారు మంచినేర్పరులగు నావికులును, వర్తకులును నయిరి. ఆప్రాంతములోని సముద్రపు

పాయలు వారికి తెలిసిన ట్లోరులకు తెలియవు. సముద్రయానములో వారినిబోలిన సాహసులు మరెచ్చటను కాన్పించరు. వారు కారు. అందుచే ఒక్కొక్క శతాబ్దము గడిచినకొలది వారున్నతదశలోనికి వచ్చుచుండిరి. వారి యౌన్నత్యమును బట్టి వారి వాసస్థానముగూడ క్రమక్రమముగా వృద్ధి నొందెను. అచ్చటి వర్తకులు చిన్నచిన్న జమీందారులుగను, ఆనగరప్రభువు మహదైశ్వర్య సంపన్ను డగు నొక రాజుగాను పరిణమించిరి. ఇటలీదేశములోని నగరములన్నిటిలోవలెను ప్రజాస్వామ్యము గలిగిన ప్రభుత్వమేర్పాటు చేయబడెను.

యూరపు ఖండమునకును ప్రాగ్దేశములకును పూర్వకాలము లో జరుగుచుండిన వర్తకమంతయు ఆనగరమార్గమున జరుగుచుండెడిది. అందుచే అచ్చటి వారందరును అచిరకాలములోనే మిక్కిలి ధనవంతులై, ఆధనమును, తమ నివాసమును అందమైనదానినిగా చేయుటకు వినియోగించిరి. ప్రతి బురదనేలయందును లోపల గట్టిస్థలము దొరకువరకు చేరగల దూలములను దింపిరి. ఈవిధముగా గట్టిచేయబడిన పునాదులమీద రాతితోను వివిధవర్ణముల చలువరాతితోను, అందమైన ప్రాసాదములు నిర్మించిరి. ఈ ప్రాసాదముల మధ్యనుండు వీధులన్నియు నీటి మయమగుటచే, ఒక యింటినుండి మరియొక యింటికి నావలపై పోవలసియున్నది.

తమనగరము నలంకరించుకొనవలెననెడి యభిలాష

శము నగరమున యేవైపునకు దృష్టిసారించినను మనకు పొడ గట్టగలదు. వెనిసులో బహు అందమగు కట్టడములెన్నియో గలవు. వాటిలో 'మార్కు' ఋషిపేర గట్టబడిన చర్చియొకటి ప్రపంచములోని వైచిత్ర్యములలో ఈమతాలయమొకటి. రమ్యములైన ప్రదేశముల వీక్షించు కుతూహలముగలవారీ మతాలయప్రాకారములందు లెక్కకు మీరి కాన్పింతురు. ఈమతాలయమునకు గోపురములును, శిఖరములును లేక ఉపరిభాగము వలయాకారముగ నుండుటచేత బయటకు యిది మతాలయమువలె కాన్పింపదు. దాని మంటపములయందలి అడుగునేల బంగారు వికారముగనుండి, నాలుగు మేలయిన గుఱ్ఱములయొక్క కంచుప్రతిమలును, వారివెనుక అనేకరంగుల గ్లాసు కిటికీలును, గలిగి మిక్కిలి యందముగా నుండును. దాని ముంగిలియంతయు చలువరాళ్లతో చప్టా చేయబడియున్నది. ఆచప్టా వద్దనే గండోలాలబడు ముఖ్యస్థానము గలదు. అచ్చట దినమంతయు గండోలియరుల కేకలు వినవచ్చుచునేయుండును.

దానికి యెదుటనే దోజెస్ రాజభవనమున్నది. ఇది ఇటలీయొక్క కళానిలయమై ఆకాశము నంటుచుండును.

వెనిసునకు దగ్గరగా అరమైలు దూరములో సిమెట్రీ ద్వీపమున్నది. వెనిసులో చనిపోయినవారి నిచ్చటకు తీసుకొని వచ్చి సమాధిచేయుదురు. చనిపోయినవారిని పడవలపైనుంచి

పూలతో అలంకరించి వాద్యములతో వైభవముగా తీసు కొనిపోయి సమాధి చేయుదురు.

ఆకులు రాలుకాలమున సారవంతమైన వెనీషియను పరగణాలో ద్రాక్షసారాయి తయారుచేయు ఫాక్టరీని చూడవచ్చును. కాని బీదలు ద్రాక్షసారాయమును మరియొక విధముగా తయారుచేయుదురు. పెద్దబండిలో ద్రాక్షపండ్లను వైచి వాటిని ఇద్దరు మనుష్యులు కాళ్లతో త్రొక్కుదురు. బండి క్రిందనుండి ఎర్రనిద్రవము క్రిందితొట్టిలో పడును. దీనిని పులియపెట్టి, శుభ్రపరచి, ద్రాక్షసారాయి తయారుచేయుదురు.

అక్టోబరు ప్రాంతమున విరోనాపరిసరములందు ద్రాక్షపండ్ల తోటలను, వాటిలో పనిచేయుచున్న కూలీలను చూడగలము. ప్రతిఅంగుళమునేలయు ఏదో సస్యముతో నిండి యుండును.

ఇటలీలో మంచిరకము ద్రాక్షరసము దొరకును. ఫ్రాన్సు మొదలగు ఇతరదేశములోవలె తళతళలాడు మంచిసీసాలలో నుండకపోయినను, అది చాల మంచిరకము. సాధారణముగా పీపాలలో పోసి వాడుకొనుచుందురు. ఇటలీలో త్రాగి మత్తెక్కినవారిని చూడము. వారెన్నడును మితముతప్పి సారాయి త్రాగరు.

వెనీషియనులకు హైందవులకువలెనే దారిద్ర్యము హెచ్చు.

# టస్కనీరాష్ట్రములో

టస్కనీరాష్ట్రము ఉత్తరఅప్పెనైన్ పర్వతములకును మధ్యధరాసముద్రమునకును నడుమ నున్నది. ఇది ఆలివ్ చెట్లతోనిండిన గుట్టలతోను, గొప్పగొప్ప పట్టణములతోను, దూరమున మంచుచే నావరింపబడిన కొండలతోను, దర్శనీయముగా నుండును. ఈరాష్ట్రమునందు మాట్లాడు భాషయే సరియైన ఇటాలియను భాష.

ఇటలీదేశమం దనేక భాషలు గలవు. చదువుకొనినవాడెవడైనను తన గ్రామమువదలి ఇతర ప్రాంతములకు వెళ్లిన అచ్చట నున్నవారు మాట్లాడు భాష తెలియనంత తేడా ఒకభాషకు మరియొకభాషకు గలదు. పూర్వ మొక రచయిత తన గ్రంథమును ఆదేశములో వాడుకలో నున్న 700 భాషలలోనికి తర్జుమా చేసెను. దేశమందలి అన్ని ప్రాంతములవారు కలసినప్పుడు టస్కనీభాషనే మాట్లాడుదురు. కాని ఇది రోమునగరమునందు తప్ప వారివారి ప్రాంతములందుపయోగించు భాష గాదు.

ఇటాలియన్ భాషలోనిధియైనను విదేశీయుడు ఇటలీకి పోయిన వారిభాష తెలియదు.

ఇచ్చటి జనులు నల్లటి కళ్లుగలిగి అందముగా నుందురు. కృషికులు నిరాడంబరముగా చిన్నగృహములందు నివసింతురు. వారిబల్లు, అరకలు, ఇంగ్లండుదేశములోవలె గుఱ్ఱములతో గాక అందమైన తెల్లని టస్కనీ ఎడ్లచే లాగబడును.

ఆర్నో టస్కనీరాష్ట్రములో ప్రవహించు నదులలో ముఖ్యమైనది. ప్రఖ్యాతిచెందిన ఫ్లోరెన్సు, పైసానగరము లీనదియొడ్డుననే యున్నవి.

ఫ్లోరెన్సు నగరమిప్పుడు మహోన్నతస్థితిలో నున్నది. పైసానగరము పూర్వమున్నత స్థితియందుండెడిది. అద్భుతమగు యిచ్చటి సిథిలములను చూచుట కనేకులు వచ్చుచుందురు. ఈపట్టణమందలి ఒక గడ్డిబయలునందు నాలుగు భవనములున్నవి. వీనిలో పైసాగోపురము ప్రజలదృష్టి మొదట నాకర్షించును. దీనిని సామాన్యముగా చిత్రములందు మనము చూచుచుందుము. దానియొక్క వింత ఆకారమే గాక అందచందములు గూడ చూడతగినవి. ఇది చలువ రాతితో కట్టబడి, మంచి శిల్పకళను ప్రదర్శింపుచు దేవశలచే కట్టబడినదాఁయనునట్లు ఆశ్చర్యము గొల్పుచుండును.

ఇది 179 అడుగుల యెత్తుగలిగి ప్రక్కకు వాలిన పెద్ద గుండ్రస్తంభమువలె కనబడును. దీని మధ్యభాగ మంతయు కాళీప్రదేశమే. దీనిలోనికివెళ్లి, కాళీప్రదేశమున నిల్చి పైకి చూచిన ఒక పెద్దనూతిలో నున్నట్లుండును. గుండ్రముగా

నిర్మింపబడిన గోడలందు పైకెక్కుటకు 300 మెట్లు గలవు. పైకియెక్కి చూచినయెడల కొండలు, పచ్చికబయళ్లు, దూరమున మధ్యధరాసముద్రము కాన్పించును. ఈమెట్లనెక్కునపుడు ఈగోపురము వాలినట్లు తెలియును. ఇది 13 అడుగులవరకు ప్రక్కకు వాలియున్నది. ఇది యిట్లు వాలియుండుటకు కారణము దీనిపునాదులలో కొంతభాగము క్రుంగిపోవుటయే. కాని ఈగోపురము మాత్రము చెక్కుచెదరక బలిష్టముగా నున్నది. 1174వ సంవత్సరమునుండి నిలువబడియున్నది. ఇంకను నిలువబడును.

పైసాయందలి మిగిలిన మూడద్భుతభవనములలోను మొదటిది క్రైస్తవమతాలయము. రెండవది జ్ఞానస్నాన భవనము. మూడవది కేంపోశాంటో మతాలయము. దీనియందు మేరీకన్యయొక్కయు, ఒకశిశువుయొక్కయు, విగ్రహము లున్నవి. ఈవిగ్రహములకు ముఖాచ్ఛాదములు తొడగబడి ముఖ్యసమయములందు మాత్రము తీయబడుచుండును. ఇటలీదేశీయుడు ఆపదలోనున్నపుడు, ఈమేరీకన్యకు మ్రొక్కుకొని ఆపదనుండి విముక్తులైనయెడల మ్రొక్కులు చెల్లించుచుందురు. దీనియందు దొక పాటలవర్ణపుగాను వ్రేలాడుచుండును.

ఇది ఈమతాలయమందు 1897వ సంవత్సరమున కట్టబడెను. ఆసంవత్సరము మతాల యోత్సవములందు, జనసమ్మర్దమువలన, ఒకస్త్రీయును, శిశువును క్రింద పడిపోయిరి.

కాని ఆశిశువునకు యేమాత్రమును ప్రమాదము కలుగలేదు. అందుచే తల్లి కృతజ్ఞతాపూర్వకముగా ఆగానునిచ్చెను.

పైసాయందలి ఒంటెల సమూహములుకూడ చూడ వలసిన విషయములలో నొకటి. పొడుగుపాటి కాళ్లతోను, పెద్ద మూపురములతోను 1000 పౌనుల బరువుగల సామాను తోను, మెల్లిగానడచు ఒంటెల సమూహములు సాధారణ ముగా కాన్పించుచుండును. ఇచ్చట 200 సంవత్సరముల నుండి మాత్రమే ఒంటెలను పెంచుచున్నారు. ఇతరస్థలము లలో కూడ పెంచుటకు ప్రయత్నములు జరిగినవిగాని పైసా లోతప్ప ఇటలీలో మరి యెచ్చటను, వీటికి శీతోష్ణస్థితి సరి పడక వృద్ధినొందలేదు. అవి నివసించుటకు వేడిగాను, పొడి గాను ఉండు ప్రదేశములు కావలెను. చలిగాను, చెమ్మగాను, ఉండు ప్రదేశములందివి త్వరగా చచ్చిపోవును. వానయన్న ఒంటెలకు కిట్టదు. విచ్చలవిడిగా నున్నప్పుడు, వానరోజు లలో చెట్లక్రింద దగ్గరగామూగి నిలుచబడి యుండును. గుడి సెలలోనున్నపుడు వాన కురియుచున్న యడల, తినుటకేమి యు లేకపోయినను అవి యెంతమాత్రము బయటికిరావు.

## ఫ్లారెన్సునగరమున

టస్కనీయందలి ఆర్నోనదియొడ్డున ద్రాక్షతోటలు, వరిపొలములు, పచ్చికబయళ్లు మొదలగు వాటిచే నావరింపబడి ప్రసిద్ధికెక్కిన పట్టణమగు ఫ్లోరెన్సు అతిసౌందర్యముగా నుండును. ఇక్కడకు కొలది దూరమునయున్న ఎప్పినైన్ పర్వతములు కానవగును. ఇటువంటి అందమగు ప్రదేశమునయుండుటయేగాక పట్టణము గొప్పభవనములతోను, అందమైన వీధులతోను, ప్రతిచతుష్పథమునందును చలువరాతితోను కంచుతోను, చేయబడిన విగ్రహములతోను, నేత్రానందముగా నుండును.

ఫ్లోరెన్సునందు డాంటీగియాట్టో, డూక్ కోశిమో, శవన్రోలా, మొదలగు వారందరిస్మారక చిహ్నములుగలవు. ఒకప్పుడు ఫ్లోరెన్సు బహుక్రూరులును, వ్యసనపరాయణులును అగు రాజులచే పాలింపబడి, ఆపట్టణపు వీధులన్నియు యుద్ధధ్వనితో మారుమ్రోగుచుండెడివి. కాని వారిలో నొక్క సుగుణముండెను. అదియేదన వారుకళోపాసకులు. మనోహరమైన వస్తువులకొరకు వారెంత సొమ్మైనను వెచ్చించెడివారు. పట్టణమందు దొమ్మీలు జరుగుచున్నను, ప్రభుత్వమనేక చేతుల లోనికి మారుచు, స్థిరప్రభుత్వములేక అరాజకముగా

నున్నను, ఆకాలమందే మహామేధావులు, చిత్రకారులు, కవులు, మహాశిల్పులు, బయలుదేరి యుండిరి. ఫ్రాన్సిస్కనులు, డామినికనులు, యిద్దరును శాంటామేరియానోవెల్లా, శంటాక్రోస్, అను గొప్పమతాలయములను నిర్మించుకొనిరి. 1334 వ సం॥రమున ఫ్లారెన్సు ముఖ్యదండనాధికారి 'శాణ్ మినియటో' నిర్మింపనాజ్ఞ యిచ్చినపుడు, అశ్రుతపూర్వమైన పనితనము గలిగి యుండు నట్లు నిర్మింప నాజ్ఞాపించెను. ఆరోజులలోని ఫ్లారెంటైనుల మనో ప్రవృత్తి యిటులుండెడిది.

ఈ పట్టణమునందు ప్రసిద్ధినొందిన 'పయొజ్జా డెక్ డ్యూమో'ను, దీని ప్రక్కనున్న 'గైటోకాంపెన్నైలు'ను చూడవలసిన కట్టడములు. గైటోకాంపెన్నైలు అనేకవర్ణము లుగల చలువరాతితో నిర్మింపబడి ఆరకపు నిర్మాణములలో ప్రపంచములో అగ్రస్థానము పొందుచున్నది.

పట్టణమధ్యభాగమందు ముఖ్యన్యాయాధిపతి నివసించుటకు 700 సంవత్సరముల క్రిందట నిర్మింపబడిన అతి అందమైన 'పాలజ్జోవెఖియో' అను భవనముగలదు. అనేక శతాబ్దముల క్రింద నిర్మింపబడుటచే ఈ భవనము పట్టణముయొక్క ఉచ్ఛనీచస్థితులను, తిరుగుబాటులు, దొమ్మీలు, మొదలైన వన్నియుచూచి, కొంత కాలము రాజావాసమై, నేడు నెపోరెన్సు న్యాయాధిపతి నివసించుస్థానమై వెలయుచున్నది.

దీని ముందరనున్న చౌకు యెల్లప్పుడును ప్రజలచే

క్రిక్కిరిసి యుండును. ఈ చౌకంతయు మిక్కిలి వైభవోపేతములగు భవనములచే అలంకరించబడి యుండును.

సామాన్యముగా టస్కనీ ప్రజలు తెలివి తేటలు గలిగి చురుకుగా నుందురు. వీరు నల్లగానుందురు. శీతకాలమందు వీరు ఉన్ని కట్టబడిన మెడపట్టీలు రంగు రంగుల కోటులు ధరింతురు.

ఫ్లోరెన్సు ప్రజలకు పర్వదినములు చాల గలవు. క్రిస్టమస్ దినములే వారికి గొప్పపండుగరోజులు. ఆరోజులలో అంగడులన్నియు ఆటవస్తువులతో నిండి యుండును.

ఎపిఫనీ అను పండుగదినము పిల్లలకు ముఖ్యమైనది. ఇది ఉత్తర ఐరోపాయందలి 'శాన్టాక్లాస్' అను పండుగనను కరించును. ఆరోజున పిల్లలు తమ జోళ్లను బాగుచేసి యుంచినయెడల రాత్రి 'లాబెఫినా' అను దేవత మంచి పిల్లల జోళ్లను కానుకలతో నింపునని వారియూహ. ఆరోజున పిల్లలందరును ఎపిఫనీ తీర్థమునకుపోయి గ్లాసుతో చేయబడిన బాకాలనుకొని వాటి కీచు శబ్దములతో తీర్థమునంతయు ప్రతిధ్వనింపజేయుదురు.

క్రైస్తవమతస్తులు నలుబది దినము లుపవాసములుండు దినములు ప్రారంభము కాగనే సామాన్య పండుగలు ముగిసి ప్రతి ఆదివారము వీటి సంబంధమైన సంతలుప్రారంభమగును. వీటియందు అన్నిరకముల తిను బండారములు, రొట్టెలు,

చిన్న చిన్న వస్తువులు, సంవత్సరమున కంతకు ఆరోజులలోనే లభించు, మతగురువులచే పావనముచేయబడిన రొట్టెలు మొదలైనవి అమ్మబడును. ఇట్టి సంతలు మొత్తము ఆరు జరుగును. వీటిఅన్నిటిలోను 5వ సంత ముఖ్యమైనది. దీని యందు ముందుజరుగబోవు వివాహములు ప్రకటింపబడి, ఆయా భార్యా భర్తలు, స్నేహితులయొక్క అభినుతులను, దీవనలను పొందుదురు. ఆరవదగు వివాహవిచ్ఛేదముల సంతయందు, ఇష్టములేని దంపతులు విడాకులిత్తురు. ఈస్టరు దినమున ఒకపావురముచే రథముకాల్చబడును. ఈరథదహనవుపండుగయందు ఫ్లోరెన్సు వాస్తవ్యులేకాక టస్కనీ ప్రజలందరును శ్రద్ధవహింతురు. ఈరథదహనవు బాగోగులను బట్టి ఆసంవత్సరపు ఫలితము లుండునని వారి నమ్మకము.

# అప్పెనైను పర్వతములు

అప్పెనైను పర్వతములు ఇటలీ దేశమునకు వెన్నె ముకవలె దేశపు పొడుగునా వ్యాపించి, ఇటలీదేశపు మే బయలునుంచి చూచినను కాన్పించుచుండును. అక్కడక్కడ శీత కాలాంతమందు సువర్ణచ్ఛాయలీను వరిపొలములున్నను, ఈ పర్వతములమీద నివసించు వారందరును పసుల కాపరులే. ఆపర్వతములందు సాగుచేయు కొద్దిభూముల నైనను, దున్నుట యెరుగని అచ్చటి రైతులు గునపములతో త్రవ్వి సాగు చేయుదురు.

అప్పెనైను పర్వతనివాసులు ప్రధానముగా, బాదము వలెనుండు చెస్టునట్టు కాయలను తిందురు. అప్పెనైను పర్వతము లన్నియు ఈ చెట్లతో నిండి యుండును. వాటి కాయలను యేరి జాగ్రత్తపెట్టుటయే అచ్చటి వారి ముఖ్యమైనపని. సామాన్యముగా చురుకైనవాడు దినమునకొక బస్తాకాయల నేరును. ఈ కాయలను ఇంటికి తీసికొనిపోయి ఎండబెట్టి విసిరి ఆపిండితో రొట్టెలు చేయుదురు. ఈరొట్టెలే వారికి ప్రధానమైన ఆహారము. ప్రతిగృహము నందును యెండబెట్టుట కొక గది యుండును. చెస్టునట్టు కాయల నన్నిటిని కర్రలతో కట్టిన అర పలమీదపోసి, క్రింద, వాటికి వేడి తగులునట్లు కుంపట్లు

పెట్టుదురు. ఈ కాయలమీాది పైపొర మాడువరకు అరపల మీాదనుంచి, తరువాత వాటిని ఒలిచి, లోపల తియ్యగా నుండు తెల్లటిపప్పును తీయుదురు. ఈ పప్పంతయు మరల యందు విసరించి, ఆపిండిని యంత్రములయందు, రాయవలె గట్టిగానుండునట్లు నొక్కించెదరు. ఎప్పటి కప్పుడు కావలసిన ముక్క బలువుపాటి కత్తితోనో లేక చిన్నగొడ్డలితోనో వగులకొట్టి, రొట్టెలు చేసుకొందురు.

ఈ పర్వతము లందుండు పిల్లలు మేకలు కాచుట యందుగాని, పశువులను కాచుట యందుగాని, నిమగ్నులై యుందురు. కాని, అచ్చట గడ్డి తక్కువ గనుక వచ్చిరొట్ట కోసుకొనివచ్చి, మేపుదురు. వేసవికాలమందు పశువులు, మేకలు మొదలైనవి ఎండుటాకులను మాత్రమేతిని జీవించును.

ఆడపిల్లలు కాచుటకు సామాన్యముగా కొన్ని గొఱ్ఱె లుండును. వీటిబొచ్చు రాట్నముమీాద వడికి, కుటుంబమునకు, కావలసిన ఉన్నివస్త్రములు, మేజోళ్లు తయారుచేయుదురు. పిల్లలు తమ గొఱ్ఱెలను తోలుకొనిపోయి, అవి మేయుచున్న పుడు ఏచెట్టు నీడయందో కూర్చొని, రాట్నముమీాద నూలు తీయుచుందురు. చెప్పునట్టుకాయలను పోగుచేయు రోజులలో పిల్లలుకూడ అతిచురుకుగా పోగుచేయుటయందు నిమగ్నులై యుందురు. కాని తల్లిదండ్రులకు వీరి సహాయమవసరము లేనపుడు, కూలికి పోవుచుందురు. వీరికి కూలిక్రింద తినుటకు

తిండియు, ఉండుటకు బసయునిచ్చి, అఖరున ఒక బస్తా చెస్టు నట్టు కాయల నిత్తురు.

మైదానముల యందుండెడి పట్టణములు, పల్లెలు మొదలైన వాటికంటె పర్వతములమీద నున్న పట్టణములు పల్లెలు పురాతనమైనవి. ఇవి సామాన్యముగా మిక్కిలి నిట్రముగా నుండి యెక్కుటకు వీలులేని కొండమీద నుండును. బండ్లు పోవుటకు వీలులేని పట్టణములు, పల్లెలు అప్పెనైను పర్వతములమీద అనేకములున్నవి. ఇక్కడకు సామానులు కంచరగాడిదల మీదగాని, ఎడ్లచేత అతికష్టముగా లాగబడు కొత్తరకపు బండ్లమీదగాని తీసుక పోబడును.

ఈ కొండల క్రింద అందమగు పచ్చికబయుళ్లు, కొండవాగులు, ఉండును. పగలంతయు కొండక్రిందనున్న బీళ్లలో పశువులను మేవుకొనియు, స్త్రీలు కొండవాగులలో బట్టలుతుకు కొనియు, సాయంకాల మవగానే కొండలెక్కి వారి వారి నివాసస్థానములకు పోవుదురు.

పూర్వము ఇటలీ దేశము అంతః కలహములతోను, విదేశీయుల దండయాత్రలతోను, అల్లకల్లోలముగా నుండెడిది. అందుచే ప్రజలు తమ గ్రామములను శత్రువులకు సులభసాధ్యము కానట్టియు, ఆహారము కొరకు ఫలవంతమయినట్టియు, ప్రదేశములందు, నిర్మించుకొని, శత్రువులు వచ్చినపుడు వారితో యుద్ధము చేయుటకు గ్రామములచుట్టును, పెద్దగోడలను నిర్మించుకొనిరి.

ఇప్పుడీదేశమందు శాంతి నెలకొని యున్నను, ప్రజలు బీదవా రగుటచేతను, క్రిందకువచ్చి మరల గృహాముల నిర్మించు కొనుట కశక్తులగుట చేతను, ఫలవంత మైనట్టియు, ప్రకృతి సౌందర్యముతో నిండియున్నట్టియు ఈ ప్రదేశములను విడచుట లేదు.

ప్రస్తుత నవనాగరికత అప్పెనైను పర్వతము లందలి గ్రామములకు వ్యాపించలేదు. వారికి అందమగు అంగళ్లు, ట్రామ్‌బళ్లు, మంచిమంచి తారురోడ్లు మొదలగు వానితో పనిలేదు. నూనె, సారాయి, మొదలగునవి తీసుకొని వచ్చుటకు, పూర్వము నిర్మించుకొనిన రోడ్లనే యిప్పటికి ఉపయోగించు కొనుచు, వాటితోనే సంతృప్తినొందియున్నారు. తమప్రాంతము లందలివారు తప్ప మిగిలిన ఇటలీ దేశములందలియు ఇతర దేశము లందలియు ప్రజలందరును గూడ వారికి విదేశీయులే.

రోమునగరమున

క్రీస్తుపూర్వము 750 సంవత్సరములకు పూర్వము టైబరునదీతీరమున కొద్దిమంది ప్రవాసితులు. రోమునగరమును నిర్మించిరి. క్రమక్రమముగా ఆపట్టణము వృద్ధినొంది, ప్రపంచ మండలి గొప్ప సామ్రాజ్యములలో నొకటియగు రోమను సామ్రాజ్యమునకు ముఖ్యపట్టణమై, అఖిల క్రైస్తవ ప్రపంచ మును శాసించు 'పోప్' నకు నివాసస్థలమై ప్రస్తుతము పూర్వపుమహోన్నత స్థితిని గోల్పోయినను, ఇటలీదేశము లోని గొప్ప నగరములలో నొకటియై వెలయుచున్నది.

ఈరోమునగరము, ఏడు పర్వతములమీద నిర్మింప బడెను. ఈనగరమునందు, క్రిస్టియను మతముయొక్క ప్రథ మావస్థ, క్రిస్టియను మతావలంబులయొక్క హింసలతోను, మతమునకై ప్రాణము లర్పించుటతోను నిండి యుండెను. రోమనుచక్రవర్తులు ఈనూత్నమతమునందు చాల అపనమ్మక మును, భయమును గలిగి క్రిస్టియనుల. నందరను సింహముల వాత పడవైచెడివారు. రోము ప్రజలు తమ ఆటలను ప్రదర్శ నమును జరిపెడి 'కొలోస్సియమ్' అను బ్రహ్మాండమైన కట్టడ మందు క్రిస్టియనులు సింహములకు వేయబడెడివారు. పేరు గాంచిన గొప్పకట్టడములలో నొకటియగు 'కొలోస్సియమ్'

యొక్క సిథిలము లిప్పటికిని గలవు. 174 అడుగుల వెడల్పు 280 అడుగుల పొడవుగలిగిన స్థలముచుట్టూ మెట్లు కట్టబడి, 50000 మంది కూర్చుండుటకు వీలుగా నున్నది. పై మెట్టు మీద నున్నవాడు రంగస్థలమును 160 అడుగులయెత్తునుండి చూడవలసినవాడై యున్నాడు. పూర్వము దీనియందే మల్ల యుద్ధములు, క్రూరమృగములతో పోరాటములు మొదలైనవి జరగెడివి.

కొన్నివందల సంవత్సరములవరకు ఈబ్రహ్మాండమగు కట్టడము రోమునందలి గృహనిర్మాతల. కొక రాళ్ళగనివలె నువయోగించెడిది. అనేక భవనములు, మతాలయములు, నాటకశాలలు దీనియొక్క రాళ్లతో కట్టబడెను. తిరువాత కొంతకాల మీవిధముగా ధ్వంసముచేయుట ఆపబడెను. కాని 1540లో రోమను కేథలిక్ మతమునం దొక యధికారి యగు కార్డినల్ అను నతడు పోప్ దగ్గరనుంచి, 12 గంటలలో తనకు కావలసినంత రాయి తీసుకొనుటకు అనుజ్ఞపొంది 4000 కూలీలనుపెట్టి చాలభాగము తీసుకొనిపోయెను.

పూర్వము క్రిస్టియను మతస్థులకు సంబంధించిన విశాలమైన భూగృహములు రోమునందనేకములు గలవు. ఇవి అనేక మైళ్లదూరము వ్యాపించి, భూమిలోనున్న మరియొక రోమునగరమువలె నుండును. క్రిస్టియనులు పూర్వము తమ్ము భాధించువారి బారినుండి తప్పించుకొనుటకు ఈభూగృహము

లందే నివసించుచు, తమ మతమును రహస్యముగా వ్యాప్తి నొందించుకొనుచు, క్రమముగా తన్మతావలంబకులు వృద్ధి నొంది బలీయులైన తరువాత ఆభూగృహములను వదలివైచిరి. ఆధునికపరిశోధకులీభూగృహములను పరిశోధించి, వాటి యందు సమాధులు, పెద్దపెద్ద గదులు, ఆసనములు, మనోహరములైన బొమ్మలు, గోడలయందు వ్రాయబడిన ప్రార్థన పద్యములు, మొదలైనవాటిని కనుగొనిరి.

ఇప్పుడు క్రైస్తవమత గురువైన 'పోప్' రోమునందలి పీటరుబుషి మతాలయమునందుండి ప్రపంచమునందలి క్రైస్తవమతాలయముల నన్నిటిని పాలించును. క్రీ॥శ॥ 306వ సంవత్సరమున పీటరుబుషి యొక్క సమాధిమీందొక మతాలయము కట్టబడెను. కాని అంతకంటె అందముగా నిర్మించ దలచి, దానికి 1506వ సం॥న పునాదివైచిరి. అది పూర్తి యగునప్పటికి 200 సంవత్సరములు పట్టెను. ఈపీటరు బుషి మతాలయము అందమగు విగ్రహములతోను సమాధులతోను నిండియుండును.

దీనిప్రక్కనే గొప్పగొప్ప భవనములవరుస లున్నవి. అందు వేటికాన్ అనునది ప్రపంచములోని గొప్ప భవనములలో నొకటి. దీనియందే పోప్ నివసించును. ఇది వస్తుప్రదర్శనశాలలతోను, నాటకశాలలతోను, సైనికనివాసస్థలముల తోను, కచేరీలతోను, నిండియుండును. ఇప్పటి పోప్ దేశ

మందు తన యధికారము చెల్లక పోవుటచేత, ఇటలీ ప్రభుత్వ
ముమీద తనకుగల అయిష్టత చూపుటకు ఈవేటికాన్ భవ
నముదాటి బయటికి వచ్చుటలేదు.

రోమునగరము మహోన్నతస్థితిలో నున్నపుడు కట్ట
బడిన అత్యాశ్చర్యకరమగు భవనములలో ప్రస్తుతము శేషిం
చియున్నది. 'పేంథియాన్' అను భవనము. పూర్వమిది
రోమను దేవాలయముగానుండి క్రీ॥ శ॥ 609 సం॥ తరువాత
క్రైస్తవమతాలయముగా మారెను. ఇది మనోహరమై వర్తు
లాకారముగా నుండును. దీనివర్తులాకారపుగోడలపైని అతి
అందమగు గోపురమున్నది. లోపలిభాగమంతయు కిటికీలు
మొదలైనవాటిచే గాక, గోపురమునందలి 28 అడుగుల
వ్యాసముగల ఖాళీ ప్రదేశమునుండి వెలుతురు వచ్చుచుండును.
రాఫెల్ అను చిత్రకారుడు దీనియందే సమాధి చేయబడెను.
దీనియందే ఇటలీ దేశపురాజులనుగూడ సమాధి చేయుదురు.

ప్రస్తుత మీనగరమున పూర్వనగరపు చిహ్నములు
ప్రతిభాగమునందును, కొద్దిగనో గొప్పగనో కానవచ్చును.
ప్రస్తుతపు పట్టణము సీజరు చక్రవర్తులుకాలములో నిర్మింప
బడిన సిథిలములపై నిర్మింపబడెను. ఈరోజువరకు రోము నగ
రమునందు కట్టబడు భవనములకు పునాది వేయుటయనునది
లేదు. పూర్వపు పునాదులమీదనే నిర్మించుచుందురు.

ప్రఖ్యాతపురుషుడైన సిసిరో ఉపన్యసించినటువంటివిన్ని

రోము నగరవాస్తవ్యులలో పెద్దలు సమావేశమైనటువంటిన్ని పూర్వపు రోము న్యాయస్థానపు శిథిలము లింకను కొన్ని మిగిలియున్నవి. పైనున్న మట్టితీసివేసిరిగాన, ఇప్పుడు శిశిరో మొదలగు మహాపురుషులు నడచిన చప్టామీద మనము నడువవచ్చును. ఇది పాలాటైను, కేపిటాల్ పర్వతముల మధ్య నున్నది. ఈన్యాయస్థానము ఉన్న ప్రదేశము మొదట చిత్తడి నేలగా నుండెడిది. క్రీ॥ పూ॥ 603 వ సం॥ము నందు 'టర్క్వని యస్ ప్రిస్కస్' పెద్దకాలువలను త్రవ్వించి ఆ స్థలము నెండ బెట్టించి గొప్ప రాతిపునాదులతో ఇప్పటివరకు చెక్కుచెద రని ఈన్యాయస్థానము కట్టించెను. అతిప్రాచీనకాలమునుండియు ఈరోము నగరమే ఇటలీదేశపు ముఖ్యపట్టణముగా పరిగణిం పబడుచుండెను. కొన్నికొన్ని కాలములయందు ఆయారాజు లీపట్టణమును వశపరచుకొనలేక ఇతరపట్టణములనే రాజ ధానిగా చేసెడివారు. కాని ప్రజలందరును రోమునగరమునే రాజధానిగా యెంచెడివారు. 1915వ సం॥రమున ఈనగరము నందే ఆస్ట్రియాతో యుద్ధము ప్రకటించబడెను.

రోమునగరమునుండి, 2000 సం॥ కు పూర్వము నిర్మిం పబడి ఇప్పటికిని చెక్కుచెదరకయున్న అప్పియన్ మార్గము గుండా పోయినయెడల మార్గమున కిరువైపులనున్న సమా ధులు కాన్పించును. పూర్వపు రోమనులు తరుచు ప్రజలకు జ్ఞాపకమునకు వచ్చునట్లు, చనిపోయినవారిని బాటలప్రక్క

పాతిపెట్టిఅచ్చట గోరీలను కట్టెడివారు. వీటిలో ప్రఖ్యాతమైనది సీజరుయొక్క ఫ్రాన్సు దేశపు రాయబారియైన క్రాసస్‌యొక్క భార్యయగు 'సిసీలియామెటెల్లా' యొక్క గోరీ. ఇది యిప్పటి వరకు చెక్కుచెదరక పూర్వౌన్నత్యమును చాటుచున్నది.

ఈ అప్పియన్ మార్గముగుండాపోయిన, ఏకాంతమైనట్టియు, నిర్మానుష్యమైనట్టియు, ప్రదేశము చేరుకొందుము. ఇదియే రోమునగరము చుట్టూయున్న రోమన్ కాంపగ్నా యను ప్రదేశము.

ఈ ప్రదేశమంతయు పూర్వపు పట్టణములయు, పల్లెలయు సిథిలములతో నిండి యుండును. అచ్చట వంకరటింకరగా నుండు రోడ్లపై బోవు రైతుల బండ్లచప్పుడు, పచ్చిక బయళ్ళకు గొర్రెలమందలను తోలుకొనిపోవు గొల్లల కేకలును మాత్రమే వినబడును.

పూర్వపు రోమునగరమునకున్నంత నీటి సదుపాయము మరి యితరపట్టణమునకును లేదు. సెబైను పర్వతముల మీద పుట్టినకొండవాగులకు అడ్డగట్లుపోసి, ఆ ప్రవాహములను రోమునగరమునకు పారించి, ప్రతిరోమపౌరునకు దినమునకు 230 గాలనులనీటిని సరఫరాచేసెడివారు.

ఆరవశతాబ్దమున గోద్సు అనువారు రోము నగరమును ధ్వంసము చేసినపుడు ఈఅడ్డగట్టులను కూడ నాశనముచేసిరి. అందుచే సెబైనుపర్వతమందలి వాగులన్నియు రోమన్ కాం

పగ్నా యనబడు ఈ ప్రదేశములోనికి ప్రవహించి, చిత్తడినేల గాను, చలిజ్వరము వచ్చు ప్రదేశముగాను మార్పివైచెను. ఈప్రాంతమందెక్కడను చెట్లు, నివాసస్థానములు లేవు. అక్కడక్కడ రోగములచే పాలిపోయి దుర్బలులుగా నున్న ప్రజలచే నిండియున్న చిన్న చిన్న పల్లెలుగలవు.

కేంపగ్నా ప్రజలందరును కృషికులుగాను, పశువులకాపర్లుగాను ఉన్నారు. అచ్చటి కృషికులు ద్రాక్షతోటలను, ఆలివ్ తోటలనుకూడ జాగ్రత్తగా పెంచుదురు. వారికి ద్రాక్షపళ్ళు కోతదినములు సంవత్సరమునందతిముఖ్యములు. వారు ద్రాక్షతోటలను అతిదట్టముగ వ్యాపింపచేసి, వాటిగుత్తులను ఆర్ర గిన్నెలలోనికి కోయుదురు. ఈద్రాక్షపంట గాక వారికి నవంబరు, డిసెంబరు నెలలందు వచ్చు ఆలీవ్ పళ్ళ పంటకూడ ముఖ్యమైనదే. ఈపళ్ళను పోగుచేసి, వీటినుంచి ఆలివ్ నూనె తీసి, మంచిరకపు నూనెను వంటకును, రెండవరకపు నూనెను దీపములకును ఉపయోగింతురు.

# నేపుల్సులో

దక్షిణ ఇటలీయందు నేపుల్సు గొప్పపట్టణము. 'నేపుల్సుచూచి మరీమరణింపుము' అను సామెత గలదు. నేపుల్సు గుండ్రముగా వంగియున్న తీరముగలిగిన సముద్రశాఖపై నిర్మింపబడినది.

నియోపోలిటనులు బ్రతికియున్నంత కాలము ఆనందముగా జీవించుటయే ఉత్తమము. అనేరకం మనుష్యులు. వీరివలెఆటపాటలతోను, సంభాషణలతోను, నవ్వులతోను, ఇలాసాగా కాలముగడిపెడివారిని మరి యెచ్చటను గానము. నేపుల్సులో వీధులకిరుప్రక్కలను జోళ్ళు బాగుచేయువారు దర్జీలు, మొదలగువారు తొందరగా పని చేయుచుందురు.

నియోపోలిటనుల నిజమైన యిండ్లు వీధులే. తినుట, కూర్చుండుట, తమ కార్యములను నిర్వహించుకొనుట, వీధులందే వారి గృహములయొక్క ఉపయోగము రాత్రి పరుండుటకు మాత్రమే.

ప్రజలలో చాలామంది బీదవారే. రాత్రి మంచుకురియుచున్నను, గృహములు లేకపోవుటచే ఆరుబయట పరుండి మంచుకు కొంకరించుకొనిపోయి, బీదతనముచే అతిసంకృష్ట జీవితము గడుపువారి నిచ్చట చాలమందిని జూచెదము. పది

గంటలగునప్పటికి సూర్యుడు వచ్చును. ప్రజలలో చురుకుగ ల్లును. సాధారణముగా యిచ్చట యెండ వెచ్చగా కూర్చుండ బుద్ధిపుట్టునట్లు కాయుచుండును. కావుననే నేపుల్సు ప్రాంత ప్రజలు సోమరిపోతులని ప్రతీతి. కాని యిది నిజముగాదు వారు కష్టించి పనిచేయుదురు. గాని పనిలేనప్పుడు మాత్రము పూర్తిగామాని, తీరుబడిగా యెండలో కూర్చుందురు. అందుచే వారెప్పుడును అట్లే సోమరిపోతులుగా కూర్చుందు రని ఇతరు లనుకొందురు.

అవినీతిపరులనునది వారిపై మరియొకనింద. పాంపే మొదలగు పట్టణములను బాగుగా పరిశీలించినయెడల నీతి అనునది యిచ్చట లేదనుట వాస్తవమే. కాని జౌత్తరాహులు తలంచినట్లు నియోపోలిటను లీవిషయము తప్పుగా పరి గణించరు.

నేపుల్సులో ప్రజలు, యేకొద్దిగానో డబ్బు సంపాదించి రోజంతయు కోటుజేబులలో చేతులుంచుకొని పట్టణములో తిరుగుచుందురు. వారికి కులాసాగా తిరుగుటయనిన బహుప్రీతి. వీధులలో యేమూలనావికడో పెట్టిన కాఫీ హోటలులో చేరి వీరు కబుర్లు చెప్పుకొనుచుందురు.

## అగ్ని పర్వతములు-దగ్ధనగరములు.

నేపుల్సు పట్టణమందలి ప్రధానభాగమునకు అన్ని పర్వతములకంటెను ఆకర్షణీయముగా కాన్పించునది వెసూవియస్ పర్వతము.

ఈ అగ్నిపర్వతములనుండి రాత్రిం బగళ్లు యెల్లప్పుడును పొగ వచ్చుచుండును. ఆప్రాంతపు ప్రతివ్యక్తియు, అంతకుపూర్వము అగ్నిపర్వత ప్రమాదము జ్ఞాపకముండుటచే, యెప్పుడు ఆపొగ నిరిపిగా బయలుదేరునో అను భయముతో నుందురు.

పర్వతపుగహ్వరమునుండి లోపలనున్న అత్యద్భుతమగు మంటలు అతివేగముగా పైకి వచ్చుటకు ప్రయత్నించునపుడు భూమి కంపించును. ఆబయలు వెడలినపొగచేత, క్రిందనున్న భూమి అంతయు, సూర్యరస్మి లేక మబ్బువేసినట్లు నీడగా నుండును. ఈదట్టమగు పొగనుండి బొగ్గులు బూడిదగ మొదలైనవి ఎగిరిపడుచుండును. క్రమముగా ముఖగహ్వరమునుండి లావా క్రిందికి ప్రవహించును. ఇది ప్రవహించు మార్గముననున్న సమస్తవస్తువులు నాశనమగును. ద్రాక్షతోటలు, వరిచేలు, మొదలగునవన్నియు, మెల్లగా ప్రవహించుచు వచ్చు లావాప్రవాహముక్రింద కప్పబడిపోవును.

ఈలావా చల్లారినతరువాత రాతివలె గట్టిపడును. లావా అతి మెల్లగా ప్రవహించును. అతిఏటవాలుగా నున్న రాతినుంచి కూడ; ప్రవహించుచున్నదా లేదా యను నంత మెల్లగా ప్రవహించును. అందుచే ప్రజలు దీనిక్రిందవడి చనిపోవుదురన్న భయములేదు.

లావా ప్రవాహమునబడి ధ్వంసమగు యిండ్లలోని వస్తువులను జాగ్రత్తపెట్టుకొనుటకు చాల అవకాశముండును. ఈప్రవాహపువాకబడు యిండ్లను గ్రామములను, ఈప్రవాహమునింకొకవైపునకు ప్రవహింపచేసి కాపాడవచ్చును. లావా చూచుటకు ద్రవపదార్థమువలె నుండి ప్రవహించుచున్నను, దానిపైభాగము చొరనశక్యముగా నుండును. బరువైన రాళ్లనా ప్రవాహముమీదికి దొర్లించినను, ఏమాత్రము మునుగక తేలుచుండును. ఆనమాలుకూడ పడదు.

అగ్నిపర్వత ముఖగహ్వరముచూచుట కతిసరదాగా నుండును. అచ్చట పంచభూతముల యొక్క అత్యద్భుతదృశ్యము కానవగును. మనము పర్వతముపై కెక్కిన కొలది వేడిగా నుండును. వేగముగా యీపర్వతము నెక్కి, గహ్వరముదగ్గరకువెళ్ళిన యడల గుండ్రనిగిన్నెయొక్క అంచుమీద నున్నట్లుండును. అది అరమైలువ్యాసము, 100 గజములలోతు గలిగియుండును. లోపలకుచూచిన యడల అడుగుభాగమంతయు రాళ్లతోను, కణకణలాడు నిప్పుతోను నిండియుండును.

అక్కడక్కడ బీటలువారి, వాటినుంచి గంధకపుపొగ బయలు దేరుచుండును. ఈదృశ్యమతిభయంకరముగా నుండును. ఈ గంధకపు పొగ పీల్చినయెడల దగ్గువచ్చును. అచ్చట మనము చాలసేపు నిలువబడిన యెడల కాళ్లు కాలిపోవును. పర్వతపు అంచుకూడ కొన్ని స్థలములందు బీటలువారి యుండును. ఆ బీటలలో మనచేతికర్రనుంచినయెడల కొద్దికాలములో మాడి పోవును. పైప్రదేశమంతయు అనేకరంగులుగా నుండును. లావా ప్రవహించి చల్లారిన ప్రదేశము నల్లగాను, అప్పుడే లావా ప్రవహించిన ప్రదేశము ఎర్రగాను, గంధకముతో నిండిన ప్రదేశము పచ్చగాను ఉండును. వీటియన్నిటికంటె లోపలి యగాధము మనల నాకర్షించును. రాత్రిసమయమందు ఈపర్వతగహ్వరమునుండి వచ్చు మంటలు, మెల్లగా కొండ మీదనుండి ప్రవహించు లావాయొక్క తెల్లటి కాంతియు, మేఘములవలె దట్టముగా వ్యాపించియున్న పొగయు చూడ వలెనేగాని వర్ణింపనలవి గాదు.

క్రీ॥ పూర్వము 79వ సం॥ర ప్రాంతమున ఈవెసూవి యస్ పర్వతము దగ్గర హెర్క్యులేనియమ్, పాంపే అను రెండుపట్టణము లుండెడివి. అప్పటికి పాంపేనగరము అంద మగుఆలయములు, స్నానవాటికలు, విహారములు గొప్పభవన ములు మొదలగువాటితో మహోన్నతస్థితిలో నుండెను. ఆగస్టు మాసమునందొక దినము దయమున వెసూవియస్

ముఖగహ్వారమునుండి ఆకాశము నంటునట్లు చాల పొగబయలుదేరి నలుదిక్కుల దిట్టముగా వ్యాపించి మిట్టమధ్యాహ్నము కూడపట్టణమునకు సూర్యరశ్మి లేకుండ చీకటితో నింపివేసెను.

కొంతమంది ఆపట్టణము వదలి పారిపోయిరి. కాని చాలమంది గృహములందు ప్రవేశించి, కొద్దికాలములో, ఈ పొగ, బూడిద, మొదలగునవన్నియు తగ్గునని వేచియుండిరి. కాని కొద్దిసేపటిలోనే బూడిదవర్షము కురియ నారంభించి, క్రమముగా హెచ్చి, కాలిన రాళ్ళతో కలసి కురియ నారంభించెను. వీథులన్నియు గంధకపు పొగతో నిండిపోయెను. అంతకంత కీవర్షము హెచ్చి, వీథులన్నియు కాలినరాళ్ళతోను, బొగ్గులతోను, బూడిదతోను నిండిపోయెను. ఇండ్లనుండి, పారిపోవుటకు బయటికి వచ్చినవా రందరు, పర్వతమునుండి విసరబడు కాలినరాళ్లు తగిలి చనిపోయిరి. ఇండ్లలోనున్న ప్రజలు తప్ప మిగిలిన వారందరును చనిపోయిరి. కాని వీరిచావుకూడ కొద్దికాలములోనే రానున్నది. మహాభయంకర ధ్వనులతో, నల్లటి వేడిబురద ప్రవాహములు వచ్చి పట్టణము నంతను కప్పివేసెను. మూడుదినములలో పట్టణము నామరూపములు కూడ లేకుండ పోయెను.

క్రమముగా కొన్నివందల సంవత్సరములకు, ప్రజలు పాంపే అను పట్టణముండెడి దను సంగతి కూడ మరచిపోయిరి. మరికొంత కాలమునకు ప్రజలు పాంపేపట్టణమును

పూడ్చివైచిన లావా మీదనే ఇండ్లుకట్టుకొని, నివసించి, ఆప్రదేశమందు వ్యవసాయము చేసుకొనుట ప్రారంభించిరి. తరువాత 18వ శతాబ్దమున పాంపేపట్టణమును త్రవ్వి బయటకు తీయ మొదలిడిరి. ఒకశిలాశాసనము దొరకువరకు, ఇది పాంపే పట్టణమని వారికి తెలియనే తెలియదు.

హెర్క్యులేనియమ్ పట్టణము లావాచే కప్పబడి పోయెను. చల్లారి గడ్డకట్టిన ఈలావాను త్రవ్వి పట్టణమును పైకితీయుట చాల కష్టమైనపని. కాని పాంపేనగరము మాత్రము బొగ్గు, బూడిద మొదలగు వానితో కప్పబడుటచే దానినిపైకి తీయుట సులభసాధ్యమే. ఈ నగరమందలి శవములు మొదలగునవన్నియు, సమాధిలో పూడ్చబడిన వాటివలె చెక్కుచెదరక యున్నవి. గోడలమీద వ్రాసిన వ్రాతలు, బొమ్మలు మొదలైనవి కూడ మంచిస్థితియందేయున్నవి. కొన్ని గోడలమీద పిల్లలచే వ్రాయబడిన గ్రీకుఅక్షరములు, వేలము వేయబడునని తెలుపు ప్రకటనలు మొదలైనవన్నియు స్పష్టముగా కాన్పించును.

ఆ రోజుననే పట్టణమందు ఎన్నికలగుటచే గోడల మీద 'క్నియస్ హెల్వేటియస్‌కు వోటుచేయుడు' అనియు 'వన్నాసుకు వోటుచేయుడు' అనియు 'పోపిడియస్‌కు వోటు చేయుడు' అనియు వ్రాయబడియున్నవి.

పాంపే యందలి వీధులు సన్నముగానుండి, చాల

భాగము ఇండ్లుకూడ చిన్నవిగా నున్నను, నాటకశాలలు, స్నానవాటికలు, విజయసూచక కట్టడములు అందమైనవి చాల యున్నవి.

పూర్వపు పాంపేవాస్తవ్యుల పనిముట్లు, పాత్రలు, అలంకారములు మొదలగున వెన్నియో ఇప్పుడు త్రవ్వి బయటకు తీయుచున్నారు. నాటినన్నిటిని ప్రదర్శన శాలల యందుంచి జాగ్రత్త చేయుచున్నారు. వీథులయందును గృహములయందును శవములనేకములున్నవి. ఒక స్త్రీ బంగారు నాణెముల సంచిని తీసుకొని పోవునపుడు పడిపోయి అట్లే యున్నది. ఒక తల్లియు కూతురు ఒకరిప్రక్క నొకరుపడి చనిపోయి యుండిరి. మరియొక స్త్రీ తన ముగ్గురు బిడ్డలతోను చనిపోయినది. వీరందరును పట్టణమును వదలి పారిపోవునపుడు చనిపోయిరి. పట్టణపుసింహద్వారమువద్ద కావలా యున్న ఫారావాడు ఆభయంకర దినమున తన నియమిత స్థానమందేయుండి చనిపోయెను. ఒక చేతఖడ్గము ధరించి రెండవ చేతితో గంధకపు పొగపీల్చకుండుటకు ముక్కు నోరు కప్పుకొని కావలాకాయుచున్నట్లుండును. ఒక పావురము తన గ్రుడ్లను కాపాడుచు గూడువదలి పారిపోక మరణించెను.

ప్రస్తుత మీపట్టము నింకను త్రవ్విబయటకు తీయుచున్నారు.

## సిసిలీద్వీపమున

ఇటలీ భూభాగముతో ఏమాత్రము సంబంధము లేకున్నను, అదృష్ట-దురదృష్టములలోను, కష్ట-సుఖములలోను, అభివృద్ధి-పతనములలోను, ఇటలీనే యనుసరించిన 'సిసిలీ' ద్వీపముకూడ ఇటలీలో నొక భాగముగ పరిగణింపబడు చున్నది.

సిసిలీ అతి ఆకర్షనీయమైన ద్వీపము. ఇది పర్వతములతో నిండియుండును. సిసిలీద్వీపవాసు లీ పర్వతముల మీదనే తమ గృహములను నిర్మించుకొందురు. అచ్చటనుండి చూచిన యెడల క్రిందనున్న ద్రాక్షతోటలు, వరిపొలములు మొదలగువానితో దేశము కన్నులపండువుగా నుండును. శీతకాలమందు ఇంగ్లండు మొదలైన దేశములు వర్షము, మంచుతో నిండియుండగా, ఈసిసిలీద్వీపము అనేక పైరుపంటలతోను వాసనలు, వెదజల్లు పూలమొక్కలతోను, నిండి యుండును.

ఇటువంటి సారవంతమై, ఆకర్షనీయమైయున్న సిసిలీ ద్వీపములో మిక్కిలి శోచనీయస్థితియందున్న కృషికులను చూచెదము. ఇంత హీనస్థితిలో నున్న వారిని యూరపు ఖండమందెచ్చటను చూడము. కాని మన దేశమందు మా

త్రము అంతకంటెను హీనస్థితియందున్నవారు కాన్పింతురు. ఇచ్చటభూమి యంతయు కొద్దిమంది జమీందారుల యధీనమందున్నది. ఈజమీందారు లందరును, రోము, నేపుల్సు, ఫ్లారెన్సు మొదలైన గొప్ప నగరము లందు నివసించుచు మహాభోగము లనుభవించుందురు. జమీందారులు సాధారణముగా తమ భూమిని ఒకనికి కవులునకిత్తురు. ఇట్లు కవులు నకు తీసుకొనిన వారు మరల చిన్నచిన్న భాగములుగా విభజించి ఈభూములనేకులకు కవులున కిత్తురు. 'గాబిలొట్టో' అనబడు ఈ మాధ్యమికుడు అన్యాయపు టొడంబడికల మీద భూమి ని కవులున కిచ్చియో, పనిచేసిన కూలీలకు కూలి తక్కువగా నిచ్చియో ప్రజలను పీడించి లాభము పొందు చుండును. అందుచే కృషికులు అన్నవస్త్రములు లేక మల మలమాడుచుందురు. జమీందారులను, వారి వద్ద భూములను కౌలునకు తీసుకొని మరల తమకు కౌలునకిచ్చి పీడించు మాధ్యమికులను మిక్కిలి ఏవగించుచుందురు.

జమీందారులు, గాబిలొట్టోలు, పెట్టు బాధలను సహింపలేక కృషికులు అప్పుడప్పుడు అతి క్రూరకార్యములు చేయుచుందురు. బీదతనమువలనను, బాధలవలనను, ఈసిసిలీ కృషికులు అన్నిటికి తెగించి దారులుకొట్టి దోపిడిచేయు బందిపోటులుగా మారిరి. ఎవడైనను ఒకడు, అనేక హింసలను పెట్టు జమీందారులనుగాని, మధ్యస్తులనుగాని చంపి, కొండల

లోనికి పారిపోయి బందిపోటుగా మారును; ఇటువంటివా రందరును ఒక సంఘముగా నేర్పడి, ఆప్రాంతవాసులను దోచు చుందురు. ఇట్టి బందిపోటుదారుల సంఘమొకటి వేలకొలది సభ్యులతో సిసిలీ ద్వీపములోని మారుమూలలకు కూడ వ్యాపించియున్నది. దీని పేరు 'మాఫియా'.

వీరు దోపిడులు చేయుటయేగాక, పల్లెలమీదపడి, ఇండ్లను ముట్టడివేసి, జనులను, ధనమును తీసుకొనిపోయి, వీరి బంధువులవద్ద ధనము తీసుకొని ఎత్తుకొనిపోయిన వారిని వదలుదురు. శత్రువులని తోచినవారివద్దనుండి ఇష్టము వచ్చినట్లు డబ్బు గుంజుదురు. పెద్ద పెద్ద రైతులవద్దనుండి ఈ దళము పన్నులు వసూలుచేసెడివారు. ఆపన్ను నియనివారు చావ వలసినదే.

ఆదళమునకు సంబంధించిన దారిని పొలముపనులకు, కూలిపనులకు నియోగించనివారు హత్య చేయబడుదురు. 'మాఫియా' కూలీలను బాధించువారి గతికూడ నంతే. అట్టివారి పొలములంటించి వేయబడును. కొంపలు కాల్చ బడును. సామగ్రులు దోచుకొనబడును. గుంపులుగా గూడి మాఫియాదళము అట్టివారిని చంపుటకు రైఫిల్లతో దాడివెడ లును. మనుష్యులను చంపుట వారి కొక వినోదము.

మాఫియాదళములోనివారు అన్నివిధముల సుఖము గా నుంచుటచేతను, వారిని బాధించుట కెవ్వరును సాహ

సింపకుండుటచేతను, బీదతరగతులాదళములో నధికముగా చేరిరి. సిసిలీద్వీపవాసులకు సాహసకార్యములయందు చాల ప్రీతి. కావున యువకులాదళములో అనేకమంది చేరిరి. చావు నందలి భీతిచే పోలీసులు, మేజస్ట్రీట్లు, పెద్దపెద్ద దేశనాయకులు కూడ ఈదళములో చేరిరి. స్త్రీలుకూడ ఈదళమున నాయకత్వము వహించిరి.

వర్తకులు, జమీందారులు, వడ్డీవ్యాపారులు, ఈదళమునకు పన్నులిచ్చి ప్రాణములు దక్కించుకొందురు. అంతవరకెందుకు-గతపర్యాయము ఇటలీ మంత్రులలో నిద్దరు 'మాఫియా' దళమునకు చెందినవారు. సిసిలీనుంచి పార్లమెంటునకు పోదలచిన ప్రతివాడు ఈదళముయొక్క అంగీకారము పొందవలసినదే.

ముస్సోలినీ ఈ మధ్యనాదళమును నిర్మూలింపదలచి చేసిన ప్రయత్నములలో 'గ్యాసీ' రాణి యను 72 ఏండ్ల ముదుసలితో తీవ్రమైన యుద్ధము చేయవలసి వచ్చినది. ఆమె మగవేషముతో తనసైనికులమధ్య నిలచి 'మోరీ' నెదురించెను.

ఈదళములో చేరదలచు ప్రతివారును, తమరక్తముతో వ్రాలుచేసి ప్రతిజ్ఞ చేయవలసి యున్నది. ఒకచీకటికొట్టులో చిన్నదీపము ముందర దళనాయకుడు తన కుడిచేత వాడియైనబాకుకొన నిలువునా పైకియెత్తి పట్టుకొనును. సభ్యుడు

కాదలచినవాడు తన అరచేయి ఆకత్తికొనపై బెట్టి నాయకుడేవో మంత్రములు చదువుచుండ తనచేతినదుముకు. ఆ గాయమునుండి కారినరక్తముతో 'నేనుకళానియమము లనుసరించెదను. వాటిని దాటను. సంఘరహస్యముల నితరులతో చెప్పను. నేను సంఘమున కేవిధమైన వ్యతిరేకమైన చేయుచో మరణశిక్ష పొందుట కంగీకరించుచున్నాను.' అను ప్రతిజ్ఞలు చేయవలెను. ఇంత కట్టుదిట్టముగా చేయబడుటచేతనే, ముస్సోలినీ యెంత ప్రయత్నించినను ఆ దళము నాశనము జేయలేకపోయెను. ఇంకను అది దేశవిదేశాలలో కట్టింపు బలముతో వ్యాపించుచున్నది. ఒక్క చికాగోలోనే ఈదళసభ్యులచే చేయబడిన హత్యలే 500 కు మించియున్నవి.

సిసిలీలోని గంధకపు గనులలో పనిచేయువారు కృషికులకంటె దురవస్థలో నున్నారు. వీరు చేయుపని కష్టమైనదైనను కూలిమాత్రము చాలతక్కువ. గంధకపుగనులలో మిక్కిలి వేడిగానుండి, గంధకపువాగతో నిండియుండును. కూలీలు పడుచుతనపు వయస్సులోనే వృద్ధులుగా కాన్పింతురు. గంధకము త్రవ్వువారికంటె దానిని మోయువారికి కష్టమెక్కువ. ఒక్కొక్కత్రవ్వువానివద్ద, ఇద్దరు మొదలు నలుగురువరకు మోయువారుందురు. ఈమోయువారందరును 7,8, 9 సంవత్సరముల వయస్సులో నున్నపిల్లలే. వీరిని బానిస

లని పిలువవచ్చును. ఏలయనిన వీరి తల్లిదండ్రులకు 50 షిల్లిం గులు మొదలు 10 లేక 12 పౌనులవరకు యిచ్చి, అవి మరల యిచ్చువరకు తమవద్ద పనిచేయుటకు చిన్నపిల్లలను తీసుకొని వత్తురు. కాని సామాన్యముగా బాకీదారులాసొమ్ము ఇవ్వ నూలేరు. డబ్బు యిచ్చినవారు, వారిపిల్లలను తిరిగి పంపనూ పంపరు. ఈవిధముగా ధనముతో వీరిని కొన్నారన్నామాట. ఇటలీదేశస్థులు చాలమంది, ఈపిల్లలచేత ఈవిధముగా కష్ట మైనపనులను చేయించుట రాక్షసకృత్యమని ఖండించు చున్నారు.

పిల్లలచేత తగనిబరువులను మోయించుటచేత వారు బాగుగా యెదుగుటలేదు. కటేనియాజిల్లాలోని యువకులలో 20% సరిగా యెదుగని పొట్టివారే.

సిసిలీలో కూరకాయలు, పండ్లు అపరిమితముగా పం డును. అచ్చటి పరిశ్రమలలో పండ్లను, కూరలను, డబ్బాలలో జాగ్రత్తచేసి, పరదేశములకు పంపుపరిశ్రమ ముఖ్యమైనది. వీటి లో టొమేటో పరిశ్రమ ప్రథమగణ్యము. పెద్దఫాక్టరీలలో ఈ పండ్లను యేరిరకములుగా విడదీయుదురు. తరువాత వాటిని యంత్రసాహాయ్యమున గుజ్జుగా చేయుదురు. ఈపరిశ్రమలో స్త్రీలు, పిల్లలు హెచ్చుగా పని చేయుచున్నారు. ఈటొ మేటో గుజ్జును ఉడుకబెట్టి, ఆరనిచ్చి తరువాత డబ్బాలలోని నెక్కింతురు.

సాధారణముగా బ్రహ్మదండి వేడిదేశములలో పెరుగును. అమెరికా, ఆస్ట్రేలియా, దేశములలో దీనిని పీడగా తలంతురు. కాని సిసిలీలో ఈబ్రహ్మదండి పండ్లు రొట్టెతోకలసి ప్రజలకు ఆహారముగా ఉపయోగపడుచున్నది.

సిసిలియనులు సాధారణముగా రాతితో కట్టబడిన యిండ్లలో నివసింతురు. వారికి ముంగిలిలోనే గంభీరమై, నిద్రించుచున్న ఎట్నా అగ్నిపర్వతము గాననగును.

ఈఎట్నా పర్వతసానువులలో అనేకమంది నివసించు చుందురు. మృత్యుముఖమున నివసించు వీరందరును కడు బీదలు. ఈప్రాంతపు ప్రజలు దృఢశరీరులు; ఉల్లాసవంతమైన, ప్రకృతిగలవారు. యూరోపున కంతకును, ప్రభుత్వములకు, చట్టములకు బానిసలుగానివారను కీర్తి సిసిలియనుల కుండెడిది. అట్టిస్వాతంత్రప్రయత్నమును ప్రస్తుతము కోల్పోయిరి. స్థిరమైనప్రభుత్వ మేర్పడినతరువాత వారి స్వభావము పూర్తిగా మారినది. వారిలో పొగరుబోతులు, స్వాతంత్ర్యప్రియులు చాలమంది అమెరికాకు వలసపోయిరి. చట్టబద్ధులైనను వారిలో ప్రత్యేకత గాననగుచునే యుండును. సిసిలియనులు నిరాడంబరులు. వారు ప్రేమించుటయు, ద్వేషించుటయు, కూడ మితముతప్పియే.

అచ్చట యెక్కువగా పూర్వగ్రీకులవలె, కూజాల నెత్తిపై నుంచుకొని, నగ్నపాదములతో కొండలనెక్కుచు,

నడుముపై చేతులుంచుకొని ఒయ్యారముగా నడచు స్త్రీలను గాంచగలము. కాని వారంత అందమైనవారు కారు. వారి కండ్లు నల్లనై మనోహరముగా నుండును. అరేబీయులబోలిన గాంభీర్యము వారి శరీరములందు గానవగును.

ఇటలీ ప్రజలు

ఇంగ్లండు, ఫ్రాన్సు మొదలైన యూరోపియనులవలె ఇటలీ దేశస్థులు గృహనిర్మాణమునందు శ్రద్ధవహింపరు. ఇటాలీయనులు గృహములను శీతకాలపు రాత్రులందు పండుకొనుటకును అప్పుడప్పుడు భోజనమునకును మాత్ర ముపయోగింతురు. ఇటాలియనులు తమ కాలమును చాలవరకు కాఫీహోటళ్ల యందును, నాటకశాలలందును గడపుదురు. కావున వారు గృహనిర్మాణముసం దంతగా శ్రద్ధ వహింపరు.

ఇటలీలోని జీవితము చాలఖరీదైనది. ఇదివరకు కంటె మూడురెట్లు హెచ్చినది. ఇదివరలో ఇతరదేశములనుండి ఇటలీకి లలితకళలకును, డబ్బు ఖర్చుతక్కువ చేయుటకును అనేకమంది వచ్చెడివారు. కాని క్రమక్రమముగా ఇప్పుడు జీవితవ్యయమెక్కువైనది.

అంగడులలో బేరమాడుట వారి కలవాటు. అందుచేత వస్తువుల ఖరీదు హెచ్చినది. అంగడివాడు తన వస్తువు ఖరీదు 100 % హెచ్చించి బేరము చేయుగా కొంత పీకులాటపెట్టి కొంత తక్కువ కిచ్చెడివాడు. బేరముచెప్పక యిచ్చువాడు. బేరము

చేయనివాడు మూర్ఖులుగా నెంచబడుదురు. కాని ఇప్పుడు 50% వెలహెచ్చించి సరియైన ఖరీదులని చెప్పి వసూలుచేయుచున్నారు.

ఇటాలియనులు నిరాడంబరులు. ఆరోజు నెట్లుగడపుదు మాయనునదియే వారిదృష్టి. రోజునకు 2 లేక 3 షిల్లింగులకే కష్టించి, ఎండ వాన యనక పనిచేయును. ఇంతమాత్రమునకే ఉదయ సాయంత్రము లందు చాలదూరము నడచిపోయి పని చేసిరావలయును. ఆపనియైనను వారికి ఎల్లప్పుడు నుండదు. సరిపడినంతతిండి యుండదు. ఇటలీలో 'పిల్లాగ్రా' అను కార్శ రోగము హెచ్చుగా నుండెడిది. అది బీదలనే హెచ్చుగా పీడించును. కాని యిప్పుడారోగము చాలవరకు నిర్మూలమైనది.

మొత్తముమీద ఇటలీ కార్మికుడు యితరులు గోల చేయునంతదుస్థితిలో లేడు. అతనికి చదువురాక పోవుటచేత తన అధమస్థితిని గ్రహింపలేక ఉన్నదానితోనే తృప్తినొందును. కొంచెము జున్నుగాని, పచ్చడిగాని, చేర్చినరొట్టె ఉదయము బటానీపప్పు మొదలైనవి మధ్యాహ్నము తిని రెండుగుక్కల సారాత్రాగి చుట్టకాల్చి తృప్తినొందును.

నాటకములనిన ఇటాలియనుల కతిప్రీతి. పాట పాడుటయు అభినయమును, వారికి పుట్టుకతోనే వచ్చును. వారు దేనినైనను సంతోషముగావిందురు. పల్లెటూళ్లలో గూడ భావమును కరగించు నృత్య గీతములను చూడవచ్చును. విన

వచ్చును ప్రచారములోనున్న చక్కని నాట్యపద్ధతి చూడవలె నన్న సిసిలీకిపోవలెను. లేదా సిసిలియను కంపెనీకిపోవలెను.

యూరోపియనులలో యితరజాతులవలె గాక ఇటాలియనులు అల్పసంతోషులు. కొద్ది ఆహారముతో చాలశ్రమపడి పనిచేయుదురు. తాత్కాలిక కష్టముల నెన్నిటినైన భరించి మరువగల స్వభావము గలవారు. అప్పటిసంగతి గాకముందు వాటిని లక్ష్యపెట్టరు. వారు దేనిని గురించియైనను అదేపనిగా ఆలోచించుచు కూర్చుండరు. బహుత్వరగా దేనినైన ముగించవలెనను దీక్షగలవారు. తలచినపని వెంటనే చేసివేయుదురు. ఆస్ట్రియనులు అగ్నివర్షము కురిపించుచుండ కందకములలో దాగి యుండుట వారికి చాలకష్టముగాయుండెడిది. శత్రువులపైబడి జయాపజయములు వెంటనే నిర్ణయింపవలెనననువారు. సాంఘిక వాదతత్వమును, వెంటనేఫాసిజమును వచ్చుటకు ఇటాలియనులలో మనోతత్వమే కారణమనిన మీకు సందేహమా!

ఇటాలియనులకు లాటరీలనిన చాలప్రీతి. ఇటలీ ప్రభుత్వమునకు లాటరీలవల్ల చాల ఆదాయమువచ్చును. ఇటలీ ప్రభుత్వము లాటరీలు సరిగానడుపబడునట్లు వాటియందు ప్రజలకు నమ్మకము కలుగునట్లుచూచును. ఇటాలియనులు ఈరకపు జూదమందు చాల ఆసక్తి చూపుదురు.

మొత్తముమీద ఇటాలియనులు చాల బీదవారగు

టచే ఎంతతక్కువ జీతమునకైనను, సంసిద్ధులగుదురు. కూలి పనులకొరకు వారు ఇతరదేశములు పోవుదురు. ఎచ్చటనైనను కష్టమైన గొప్పపనులున్నయెడల అచ్చటకు పనికొరకు వేలకొలది ఇటాలియనులు సంసిద్ధులగుదురు. ఎంతతక్కువ కూలియిచ్చినను దానిలోకొంత భాగము కుటుంబముకొరకు మిగల్చి మిగిలిన దానితోనే క్లుప్తముగా జీవనము గడపుదురు. వారు కుటుంబముకొరకు తమసంపాదనలోకొంత మిగల్చుటకు ఉపవాసములు చేయుటకైనను వెరువరు. కష్టపడి పనిచేయువారగుటచేతను, తక్కువకూలికి వచ్చుటచేతను, యెవ్వరైనను వారిని సంతోషముగా పనిలో నియమించుకొందురు. కాని మిగిలిన యూరపుదేశములలోని కార్మికులు వీరితో పోటీ కాగలేక వీరి నసహ్యించుకొందురు. యేమాత్రము చిన్నకలహమైనను సరియే, జరిగినయెడల వెంటనే ఇటాలియనులు కత్తిదూసి కలియబడు స్వభావము గలవారు. కలహములు వచ్చినయెడల సాధారణముగా హత్యలు జరుగుచునే యుండును.

౧

గ్రీకు నాగరికత యారంభమైన కొలది కాలమునుండి, ఇటలీయొక్క చరిత్ర మనకు తెలియ వచ్చుచున్నది.

క్రీ॥ పూ॥ 1000 సంవత్సరముల క్రిందట ఇటలీ అంతయు మహారణ్యములతోను, సింహములు మొదలైన ఘాతుక మృగములతోను నిండి దుర్గమముగా నుండెడిది. దేశము ఈజియను జాతికి సంబంధించిన ఎట్రుస్కను జాతివారి యధీనములో నుండెడిది. ఈ ఎట్రుస్కను జాతివారు భూమిమీద, నీటిమీద కూడ అసమానమైన యధికారము గలిగి యుండెడివారు.

నేటి ప్రపంచ చరిత్రలో మంచి ఖ్యాతి సంపాదించిన రోమునగరము, నాటికి 'టైబరు' నదిమీద జరుగు నాటి వ్యాపారమునకు కేంద్రస్థలముగా నున్న ఒక చిన్న పట్టణము. మధ్య ఏషియా ప్రాంతములనుంచి బయలుదేరి పశ్చిమముగా వచ్చిన ఆర్యులు మధ్య ఇటలీలలోను, ఉత్తర ఇటలీలోను చేరి ఎట్రుస్కనుల పరిపాలనకు లోబడి చిన్న చిన్న గ్రామములు కట్టుకొని నివసించెడివారు. గ్రీకులు దక్షిణ ఇటలీలోనికి సిసిలీలోనికి వలసవచ్చి క్రమముగా స్థిరపడిరి.

ఇట్లు నెమ్మదిగా ఆర్యజాతీయులగు రోమనులు, ఉత్తర ఇటలీ, మధ్యఇటలీలోను, గ్రీకులు దక్షిణఇటలీ, సిసిలీలలోను ప్రబలులుగా జొచ్చిరి. వారు నలుమూలల చిన్నచిన్న రాజ్యములు నిర్మించుకొని ప్రక్కనున్న ఎట్రస్కనులతో గిల్లికజ్జాలు పెట్టుకొనసాగిరి. కాని పౌరుషవంతులును, సమర్థులును నైన ఎట్రస్కనులు సాధారణముగా లొంగలేదు. ఇంచుమించు 400 ఏండ్లు గొప్ప యుద్ధము జరిగిన తరువాత క్రీ॥ పూ॥ 500 సం॥ ప్రాంతమున లొంగిపోయిరి.

ఎట్రస్కనులను నాశనము చేసిన తరువాత రోమనులు అంతకంటె ప్రబలులైన గాలుల నెదుర్కొనవలసివచ్చెను. క్రీ॥ పూ॥ 390 సం॥న గాలులు ఆల్ప్సుపర్వతములుదాటి ఇటలీ ప్రవేశించి అనేక స్థములందు రోమను సైన్యముల నోడించి రోమునగరమును ముట్టడించిరి. వెంటనే రోమనులు చాలధనము లంచమిచ్చి గాలుల దాడినుండి విముక్తులైరి.

వెంటనే రోమనులు గొప్ప ప్రయత్నములుచేసి ఆర్నో మొదలు నేపిల్సు వరకు గల ప్రదేశమంతయు ఆక్రమించుకొని, గాలుల దాడినెదుర్కొనుటకు సరిహద్దులందు బలీయములైన కోటలు నిర్మించుకొనిరి.

క్రీ॥ పూ॥ 323 సం॥లో అలెగ్జాండరు చనిపోయిన తరువాత గ్రీకుసామ్రాజ్యమంతయు భిన్నాభిన్నమై ఒక్కొక్క భాగమొక్కొక్క గ్రీకుసేనానాయకుని యధీనమయ్యెను. ఆసమ

యమున ఇటలీ ప్రాంతపు గ్రీకురాజ్యాధిపతియైన 'పిర్రస్' అను సాహసికుడు రోమనుల నోడించి ఇటలీ అంతయు ఆక్ర మించుకొనుటకు గొప్పసైన్యము తయారుచేసెను. ఈగ్రీకు సేనానాయకుడు క్రీ॥ పూ॥ 280సం॥లో 'హిరాక్లియా' వద్దను, 279సం॥ లో 'ఆస్కుల్లలము' వద్దను రోమనులను పూర్తిగా నోడించి మధ్య ఇటలీలో చాలభాగము ఆక్రమించి విజృం భించెను.

అప్పటికి ఆఫ్రికాఖండపు ఉత్తరభాగమున ఉచ్ఛస్థితి యందున్న కార్థేజియనులు, గ్రీకుల యౌన్నత్యమును సహింపలేక, ఇటలీలో యుద్ధము తీవ్రముగా సాగించుటకు రోమనులను పురిగొల్పి, తమనౌకాసైన్యముతో గ్రీసునుంచి 'పిర్రస్' కు యేవిధమైన సహాయము రాకుండున్లు మార్గ మరికట్టిరి. అప్పుడు 'బెనివెంటం' యుద్ధములో పిర్రస్ అపజయమునొంది తన ఇటలీ రాజ్యమంతయు కోల్పోయి స్వదేశమునకు వెడలి పోయెను. ఇటలీ పాదాగ్రము వరకు నున్న దేశమంతయు రోమనుల యధీనములోనికి వచ్చెను. సిసిలీద్వీపము కార్థేజి యనుల యధీనమయ్యెను.

క్రీ॥ పూ॥ 264వ సం॥లో రోమనులకు, కార్థేజియనులకు యుద్ధములు ప్రారంభమై సుమారు 150 సం॥లు జరగెను. వీటి నే ప్యూనిక్ యుద్ధములందురు. 264 సం॥ మొదలు 241 వసం॥ వరకు జరగినయుద్ధములను మొదటి ప్యూనిక్ యుద్ధమనియు

219 మొదలు 202 వ సం॥ వరకు జరిగిన యుద్ధములను రెండవ ప్యూనిక్ యుద్ధమనియు, 149 సం॥ మొదలు 145 వ సం॥వరకు జరిగిన యుద్ధములను మూడవ ప్యూనిక్ యుద్ధమనియు పిల్చు చున్నారు.

మొదటి ప్యూనిక్ యుద్ధము నాటికి రోమనులు, కార్థేజియనులు సమాన బలవంతులగుటచే కొన్ని యుద్ధములందు రోమనులు, మరికొన్ని యుద్ధములందు కార్థేజియనులును జయమునొందిరి. కాని 242 వ సం॥ ప్రాంతమున కార్థేజియనులు పరాజయమొంది, సిరాక్యూసు మినహాగా మిగిన సిసిలీ యంతయు నిచ్చి సంధిచేసుకొనిరి.

క్రీ॥ పూ॥ 753వ సం॥న రోము రాజ్యమేర్పడి నప్పటి నుండియు సుమారు 2 శతాబ్దముల వరకు రాజులచేతనే పాలింపబడెడిది. కాని 'టార్క్విన్ సుపర్బస్' అను రాజు మదాంధుడై ఒక పతివ్రతను చెరచుటచే ప్రజలు కోపోద్దీపితులై, రాజునుచంపి, రాజ కుటుంబమును పారద్రోలి, ప్రజాస్వామ్య మేర్పరచుకొనిరి. నాటినుండియు రాజ్యాంగ వ్యవహారము లన్నియు, సెనేటు యధీనమందుండెడివి. ఈ సెనేటుకు సభ్యులు ప్రజలనుండియే ఎన్నుకొనబడెడివారు. ప్రజలకందరకు సెనేటుసభ్యుల నెన్నుకొనుటకు హక్కు యుండెడిది. కాని బానిసలకు ప్లెబియనులకు మాత్రము ఓటుచేయుట కధికారములేదు. అందుచే క్రమముగా ప్లెబియనులలో అసంతృప్తిహెచ్చి తిరుగు

బాటులు ప్రారంభించిరి. మొదటి ప్యూనికు యుద్ధసమయమున ప్లెబియనులు కూడ ఓటింగు అధికారమునొందిరి. ప్యూనికు యుద్ధము తరువాత సారవంతమైన సిసిలీ ఇటలీ ఐశ్వర్యాభి వృద్ధికి బాగుగా తోడ్పడెను. కాని దానివలన లాభమునొందినది ధనికులు మాత్రమే ప్యూనిక్ యుద్ధమునకు పూర్వము ప్రజలు స్వంతవ్యవసాయదారులై యుండెడివారు. వారుశాంతి సమయములందు వ్యవసాయముచేయుచు, అవసర సమయములందు సైన్యములలోచేరి యుద్ధములు చేయుచుండెడివారు. క్రమముగా కొంతకాలమునకు పరిస్థితులు తారుమారై యుద్ధములలోనికివెళ్ళిన సామాన్యరైతులు ఋణములపాలై భూములను కోల్పోయిరి.

మొదటి ప్యూనికు యుద్ధము అయిన తరువాత గాలులు ఇటలీపై దండెత్తిరి. రోమనులు వారిని 'టెలమన్' యుద్ధమందు ఓడించి వెనుకకు తరిమి, ఇటలీయంతయు తమ యధికారములోనికి తెచ్చుకొనిరి. క్రీ॥ పూ॥ 390 సం॥ నాటికి గాలుల ప్రథమదండయాత్రకు పూర్వము 20 చ॥ మైళ్ళవైశాల్యముగల రోమను రాజ్యము క్రీ॥ పూ॥ 240 సం॥ నాటికి ఇటలీ అంతయువ్యాపించెను.

మరల క్రీ॥ పూ॥ 220 వ సంవత్సరమున కార్థేజియనులకు చెందిన కార్సికా, సార్డీనియా ద్వీపములందు విప్లవము కలుగగా, అన్యాయముగా వాటిని రోమనులు ఆక్రమిం

చిరి. దీనితో 22 సం॥ లనుండి చల్లారినద్వేషాగ్ని మరల రగుల్కొని ఇరుదేశముల వారికి మరల యుద్ధముప్రారంభమయ్యెను. 'హానిబల్' అను యువకసేనాని అధీనమున కార్థేజిసైన్యములు స్పెయిన్ మార్గమునవచ్చి, ఆల్ప్సు పర్వతములుదాటి ఇటలీలో ప్రవేశించి, యుద్ధమారంభించెను. హానిబల్ మహాసమర్థుడు. వ్యూహనిర్మాణమునందును, సేనాచాలనమందును అద్వితీయుడు. పదునైదేండ్లు ఇటలీలో యుద్ధము సాగించి 'ట్రాసిమీర్' సరస్సువద్ద, 'కేనే' వద్ద రోమను సైన్యములను పూర్తిగా ధ్వంసమొనర్చెను. కాని రోమను సైన్యములుకొన్ని సముద్రమార్గమున ఫ్రాన్సులోని 'మార్సెలీసు' ప్రవేశించి కార్థేజిసైన్యములకు స్వదేశమునుండి సహాయముగాకుండ నరికట్టెను. అందుచే రోమునగరమును ముట్టడించుటకు తగిన సామగ్రిలేక 'హానిబల్' ఊరకుండవలసివచ్చెను. ఇంతలో కార్థేజియను సామ్రాజ్యములోని న్యూమిజియను జాతి తిరుగుబాటొనర్చెను. ఆతిరుగుబాటునాధారముచేసుకొని రోమను సైన్యములుకొన్ని కార్థేజినే ముట్టడించెను. వెంటనే, చేయునదిలేక కార్థేజి, సామ్రాజ్యభాగమును, సేనాధిపతిని, నావికాదళాన్ని, రోముకిచ్చి సంధిచేసుకొనెను. ఈ సంధి 56 సం॥ లు నిర్వహించబడినది. ఈ కాలములో రోమనులు గ్రీసునాక్రమించి, అసియామై

నరు ఈజిప్టుమొదలైన దేశములను మిత్రరాజ్యాలనుపేరుతో సామంతరాజ్యములుగా జేసుకొనిరి.

రెండవ ప్యూనిక్ యుద్ధము తరువాత ఇటలీరైతు పూర్వముకంటె హీనస్థితికివచ్చెను. మొదటి ప్యూనిక్ యుద్ధములో నాశనమునొందని సామాన్యపౌరు లందరును ఈరెండవప్యూనిక్ యుద్ధ మాఖరగునప్పటికి పూర్తిగా ఋణ ములపాలై భూములను పోగొట్టుకొనిరి.

ఈపరిస్థితులలో రోమనుకాన్సలులు, అప్పుడే వెనుకటి యుద్ధముల శ్రమనుండి కోలుకొనుచున్న కార్థేజినిచూచి సహింపలేక, లేని కారణములను కల్పించి మూడవ ప్యూనికు యుద్ధము ప్రారంభించిరి. క్రీ॥ పూ॥ 149 సం॥లో రోమనులు కార్థేజిని ముట్టడించిరి. మూడు సం॥లు రోమనుల నెదిరించి 146 వ సం॥న కార్థేజిలోబడెను. పట్టుబడిన కార్థేజిలో రోమ నులుచూపిన క్రౌర్యము వర్ణనాతీతము. ఆరురోజులు చేతికందిన వారినెల్ల వధించి, చివరకు మిగిలిన 50 వేల మందిని బాని సలుగా పట్టుకొని, పట్టణమును నేల మట్టమొనర్చిరి. ఈవిధ ముగా 150 సం॥లలో రోమనులు కార్థేజియను సామ్రాజ్య మును నాశనమొనర్చిరి.

కార్థేజినాశనముతో రోమను సామ్రాజ్యములోని సా మాన్యకర్షకులు కూడనశించిరి. నిరంతర యుద్ధముల వలన ప్రజలు విపరీతముగా నశించిరి. ప్రజలకు సామ్రాజ్యనిర్వహణ

మందుగల అధికారము కూడ నశించెను. సామ్రాజ్యనిర్వహణ కొరకేర్పడిన రెండు సెనేట్లలోను ఒకటి ధనవంతుల యధీనములోను, రెండవది సామాన్యప్రజ యధీనములోను ఉండెడిది. రోము చిన్నరాజ్యముగా నున్నపుడు ఈరెండు సభలకు సరియైన వినియోగముండెడిది. రెండవదగు ప్రజాసభకొద్దిమందితో నుండెడి ప్రభువులసభను తన యధీనములో నుంచుకోగలిగెను. కాని ప్యూనిక్ యుద్ధములు ఆఖరగునప్పటికి జనసామాన్యములో చావగా మిగిలిన వారుదరిద్రులు, నిర్వీర్యులు అగుటచేత ధనవంతులు అధికారమునంతను తమ హస్తగతము చేసుకొనిరి.

## ౨

కార్థేజిని నాశనముచేసి అక్కడ తమ ప్రభుత్వము స్థాపించుకొనిన తరువాత అచ్చట 'న్యుమిడియనులు' రోమునుల నెదిర్చిరి. 'న్యుమిడియనులు' కార్థేజియనులమీద నే తిరుగబడి యుద్ధముచేసిరి గాని అప్పుడు స్వాతంత్రము నొందలేక పోయిరి. కార్థేజి సామ్రాజ్యము నశించగా నే వారు స్వాతంత్రమునొందిరి. రోమను సైన్యములు 'న్యుమిడియను' లను జయించలేకపోయిరి. అందుచే ప్రభువుల సభ 'మారియసు' ను కాన్సలుగాచేసి 'న్యుమిడియను'ల నడచుపని నతనికిచ్చిరి.

మారియసు సైన్యములను క్రొత్తపద్ధతిని తయారుచేసి, బలవత్తరమైన ఆసైన్యములతో ఆఫ్రికాచేరెను. అప్పుడు జరిగినయుద్ధములో 'న్యుమిడియను'లు పూర్తిగా పరాజయమొందిరి. క్రీ॥ పూ॥ 106 సం॥ న వారి రాజగు 'జుగుర్తా'ను సంకెళ్ళతో రోము తీసుగువచ్చిరి.

క్రమశిక్షణనొంది, బలవత్తరమైన తన సైన్యములతో 'మారియసు'రోముసింహాసనమాక్రమించి యధికారము చెలాయించెను. అప్పటినుండి యేసేనానాయకులు ప్రబలులై, బలవంతులైనవారు సైన్యసహాయమున అధికారము హస్తగత

మొనర్చుకొని పరిపాలన సాగించుచువచ్చిరి. మారియసు క్రింది సేనానియైన 'సల్లా' కు 'మారియసు' కు మనస్పర్థలుగలిగి బహిరంగముగాను, రహస్యముగాను, ఉభయకక్షులు ఒకినొకరు చంపుకొనుచు దేశమందు అంతఃకలహములు బయలుదేరతీసిరి. నాయకుల ఈ పరస్పరయుద్ధములో అనేక వేలమంది నాశన మొందిరి. మారియస్ సల్లాలవైరము వారి మరణాంతము వరకు తీరలేదు.

వారి తరువాత రాజ్యాధికారము కొరకు పాంపే-క్రాసస్- జూలియస్ సీజరు మొదలగువారు కలహమారంభించిరి. ఆరోజులలోనే 'స్పార్టకను' అనువాని నాయకత్వమున దేశములోని బానిసలు, రైతులు తిరుగుబాటొనర్చిరి. క్రాసను వారితో 2 సంవత్సరములు యుద్ధముచేసి వారినోడించి 6000 మంది విప్లవకారులను రోమునుంచి దక్షిణముగాపోవు 'అపియన్' మార్గమున ఉరితీయించెను. క్రాసను తరువాత పార్థియనులతో యుద్ధమందు ఓడి హతుడయ్యెను. పాంపేసీజరుతో చాలకాలము యుద్ధముచేసి తుదకు ఈజిప్టులో హతుడయ్యెను. ఇట్లు క్రీ॥ పూ॥ 43 వ సం॥న సీజరురోము సామ్రాజ్యమునకు సర్వాధికారి అయ్యెను.

సీజరు అంతటితో తృప్తినొందక రాజు కావాలనికోరెను. దేశములోని నాయకులు రాజపదవి మినహాగా సమస్తాధికారములుఇచ్చి గౌరవించిరి. సీజరుసంతృప్తి నొందలేదు. చివర

కాతడు బహిరంగముగా ప్రజలచేత సెనేటు మందిరములో హత్యచేయబడెను.

సీజరు తరువాత వెపిడస్ - ఆంథోనీ - ఆక్టేవియస్ సీజరులు రోమనుసామ్రాజ్యమును పంచుకొనిరి. కాని కాల క్రమేణ క్రీ॥ పూ॥ 30 సం॥ న ఆంథోనీ చనిపోయిన తరువాత ఆక్టేవియస్ సీజరుసర్వాధికారియయ్యెను. ఇతడు నిరంకుశాధికారమువదలి సెనేటుకు సర్వాధికారములు తిరుగనిచ్చివైచెను. అందుచే సెనేటు వారతనికి సర్వాధికారము ల సమర్పించి రాజుగాచేసిరి. అగస్టస్ సీజరను పేరుతో ఇతడు క్రీ॥ పూ॥ 27 సం॥ నుండి క్రీ॥ త॥ 14 వ సం॥ వరకు మొట్టమొదటి రోమనుచక్రవర్తిగా నుండెను.

ఈచక్రవర్తి కాలంలోనే రోము సామ్రాజ్యానికి శాశ్వతమైన అపకీర్తితెచ్చి పెట్టే దురంతం న్యాయంపేరిట జరపబడింది. క్రీస్తు మీద అర్థములేని కొన్ని నేరములుమోపి ఆతనిని శిలువను వేసేరు రోములోని మతాధికారులు. క్రీస్తు వెనుక మూడు శతాబ్దముల వరకు రోము క్రైస్తవులకు కేవలంవ్యతిరేకభావం చూపించినా కాన్స్టన్టైన్ చక్రవర్తితో ఆబాధ లణగిపోయి రాజమతమై పోయింది క్రైస్తవమతం.

అగస్టస్ సీజరు వెనుక టైబీరియస్ సీజరు సింహాసనం ఎక్కేడు. కలిగ్యులా-క్లాడియస్-నీరో వగైరాలు స్వల్పసల్ప కాలము మాత్రమే పరిపాలనచేసేరు. వీరిలో నీరోచేతిలో

రోముపడిన బాధలనంతాలు. ప్రజలనిచంపడం గ్రామాలు తగులవేయడం ఆతనికి సరదా. రోము అంటుకుంటూంటే నీరో దగ్గరనున్న కొండశిఖరం ఎక్కి చూస్తూ ఆనందముతో ఫిడేలు వాయించుకొనే వాడట!

క్రీ॥ త॥ 98 సం॥రములో ట్రాజెస్ సింహాసనంఎక్కి యూఫ్రటీస్ నదివరకు సామ్రాజ్యం విస్తరింపచేసెను. ఈతని తరువాతవచ్చిన హేడ్రియన్ రాజులు వగైరాల దండయాత్రలనుండి రక్షించుకోలేక ట్రాజెస్ సంపాదించిన కొన్ని రాజ్య భాగాలు వదలివేసి కొన్ని కోటలుకట్టి సరిహద్దులు కాపుచేసు కొన్నాడు.

ఏంటొనీప్రయన్ — మార్క్స్ అరీలియస్ మొదలగు వారు క్రమంగా రాజ్యం ఆక్రమించుకొని క్రీ॥ త॥ 180నాటికి ప్రజాసామ్యతరూపుమాపి రాజ్యాధికారం మరలస్థాపించేరు.

# 3

క్రీ. శ. 160 నుండియే రోముసామ్రాజ్యం పతితంకా జొచ్చింది. 164 నుండి ఇరువదియేళ్లపాటు దేశంలో అవిచ్ఛిన్నంగా సామ్రాజ్యంచేసిన మహామారి మొదలగు భయంకర వ్యాధుల బారిపడి రోమక సామ్రాజ్యంనిర్జనారణ్యముగా పరిణమించింది.

దానికితోడు క్రైస్తవులనే పేరిటకొందరు ప్రభువుల కత్తులకెరమైనారు. అంతఃకలహాలు- సంచారిజాతులదాడులు దుర్భరమైపోయినాయి. క్రమముగా రోముసామ్రాజ్యము ఒక్కొక రాష్ట్రమునే పోగొట్టుకొనడం ఆరంభించింది.

క్రీ. శ. 247 లో గాత్తులచేతిలో డెసియన్ డాన్యూబు రాష్ట్రాలతో ప్రాణాలుకూడా పోగొట్టుకున్నాడు. తరువాత "డాసియా" పోయింది. చివరకి కి వందల ఏళ్ళపాట సంరక్షణ ప్రయత్న మెరుగని రాజధానికి కోటలుకట్టి సంరక్షణాప్రయత్నాలు చేయవలవలసి వచ్చింది.

ఈ శతాబ్దంలో రోము చక్రవర్తులు తమచేతగానితనాన్ని క్రైస్తవమతంమీదికి త్రిప్పివారి ప్రాణాలుతీసి, ఆస్తులువశంచేసుకొని అల్లరిచేసేరు. కాని చివరకు నాలుగవ శతాబ్దప్రారంభములో చక్రవర్తియైన కాన్స్టాంటైన్ క్రైస్తవ. మ

లనేడ కొంతసానుభూతిచూపి చివరకు తానుగూడ క్రైస్తవ మతములను స్వీకరించేడు.

. నాలుగవ శతాబ్దము యొక్క చివర భాగమున ఇటలీ కొంత శాంతముగ నున్నదిగాని థియోడోసియసు చక్రవర్తి చనిపోయిన వెనుక మరల అల్లరులారంభమైనాయి. "అలరిక్" అనుగాత్తు జాతినాయకుడు క్రీ. శ. 40 లో రోమును ముట్టడించి నానాభీభత్సము చేసివేశాడు.

తరువాత సముద్రతరంగాలమధ్య నున్న చిన్న తెప్ప వలె - ప్రతిచిన్న ఊపుకి సమూలం కదిలి పోతూవచ్చింది ఇటలీ. క్రీ. శ. 455 లో "దండాలులు" రోము నాక్రమించి- కార్సికా-సార్డినియాలను మీరి కొన్ని ద్వీపాలను వశంచేసుకొని సామ్రాజ్యం బరువువాదిల్చేరు.

5వ శతాబ్దపు రెండవ పాదములో హూణులు ఇటలీ ప్రవేశించి "పన్నోనియా." అను రాష్ట్రము నాక్రమించుకొనిరి. ఈహూణుల దండయాత్రలలో "అత్తిలు" డనే నాయకు డిటలీ ప్రవేశించి "అక్విలియా-పాడువా" నగరములను ధ్వంసముచేసి "మిలన్" దోచుకొని దేశంలో పెద్దయలజడి కలిగించేను. ఆతని క్రౌర్యాని కాగలేక ఉత్తర ఇటలీ నుండి పారిపోయిన ప్రజలు ఆడ్రియాటిక్ సముద్రములోని కొన్ని దీవులలో ప్రవేశించి యచటనే పట్టణము గట్టుకొని యుండి పోయిరి. అదియే నేటి "వెన్నిసు" పట్టణము.

క్రీ. శ. 475లో "రోమ్యులస్ అగస్టస్" అను చక్రవర్తిని "ఒడోసరు" అను హూణనాయకుడోడించి - తరిమి రోమక సామ్రాజ్యమంతమైనట్లు ప్రకటించేడు.

5-6 శతాబ్దులలో ఇటలీ బాగుగా అంతః కలహాలతో నిండియుండి. సామ్రాజ్యసింహాసనం రోమునుంచి జర్మనీకి తొలగింది. దేశములో మతాధికారుల ప్రాబల్యం హెచ్చింది.

568లో లాంబార్డుల దాడివలన పదభ్రష్టుడైన పోపు స్టీఫెన్ II పెపిన్(ఫ్రాంకుల నాయకుడు) యొక్క బలసాయమున మరల రాజ్యము సంపాదించేడు.

లంబార్డులు తరువాత కూడ ఉపద్రవ్యపు దళ్లరులు చేస్తూనే యుండేవారు. కాని క్రీ. శ. 800తో వారు పూర్తిగా ఓడి పారిపోయిరి. అప్పుడు చక్రవర్తియైన "చార్లమన్" పోపున కధికారమీయకుండానే స్వతంత్రంగా రోమక సామ్రాజ్యం పునర్నిర్మాణం చేయాలని ఉద్దేశించేడు. ఇదే పోపుకి-చక్రవర్తులకి మన స్పర్థలు కలిగించడానికి కారణం అయింది. పోపులు ఫ్రెంచి-నార్మన్-స్పెయిన్ రాజులను సాయంకోరుతూండేవారు. చివరకు పోపు ఇతరుల సాయంతీసుకొని జర్మను చక్రవర్తిని తరిమివేశాడు.

కాని-ఈ మధ్యకాలములోని యరాజకసమయమున ప్రతిపట్టణము తన ప్రాంతీయ గ్రామాలను కలుపుకొని చిన్న

చిన్న ప్రభుత్వాల నేర్పాటు చేసుకొన్నాయి. లంబా టస్కనీ రాష్ట్రాలలో ఈపద్ధతిబాగా వ్యాపించింది.

ఈచిన్నచిన్న ప్రభుత్వాల కాలంలో రాజ్యాంగ కల్లోలముల మాటలెట్లున్నా నాగరికత బాగా యభివృద్ధి చెందింది. కళలకి మంచి ప్రోత్సాహం ఈయబడింది.

15 వ శతాబ్దము చివరకు క్రమముగా యీచిన్న చిన్న శక్తుల పలుకుబడు లంతమొంది పోపు - నేపిల్సు - మిలన్ - ప్లారెన్సు - వెన్నీసుల స్వతంత్ర రాజ్యాలు మిగిలినాయి. వీనిలో వెనీసు చాలాబలముగాయుండేది. ఇతర ప్రభుత్వాలు దానిమీదగల యసహ్యముచేత ఇతర దేశాలతో కుట్రలుసాగించేయి.

"మిలన్" ప్రభుత్వపు ఆహ్వానముపై స్పెయిన్ రాజగు 8 వ ఛార్లసు 1494 లో ఇటలీపైదలడెత్తివచ్చి నేపిల్సును జయించేడు. కాని నేపిల్సెంతకాలమోవరాధీనముగా యుండలేదు. ఛార్లసుసేనలు వెనకతిరగగానే మరల నేపిల్సు స్వాతంత్ర్యం ప్రకటించింది.

మూడుసంవత్సరముల వెనున్ (ఫ్రాన్సురాజు) 12 వ. లూయీ వెనీసు సాయముతో మిలన్‌ను జయించేడు.

10 సంవత్సరములలో మిలన్ మరల తలయెత్తి చుట్టు ప్రక్కలనున్న చిన్నరాష్ట్రాలతో కలసి ఒక సమితి ఏర్పాటు చేసింది వెన్నీసున కెదురెత్తుగా. కాని ఆసమితి అట్టేబలవంతమైనది కాలేకపోయింది.

1515 లగాయతు ఫ్రాన్సు - స్పెయిన్ రాజులు ఇటలీ పలుకబడి సంపాదించుటకు పోటీలువడి పోరాటము సాగించిరి.

పదేళ్లపాటు జరిగిన యుద్ధంలో ఉభయులు నష్టపడ్డారు. చివరకు 1525 లో "పావియా" నద్దజరిగిన యుద్ధంలో ఫ్రెంచి రాజు 1వ ఫ్రాన్సిస్ బందీయైనాడు.

1559 లో యూరపులోని బలవద్రాజ్యాలసంధిలో స్పెయిన్‌కి ఇటలీలో పలుకుబడి బాగా స్థాపింపబడినది.

ఈ శతాబ్దాంత్యమునకు ఇటలీలో మిగిలిన బలమైన రాజ్యాలు పోపుది-స్పెయిన్‌ది మాత్రమే. "వెన్నిసు" స్వతంత్రంగానే ఉంది కాని చాలాదుర్బలంగా ఉంది. కాని "శావోయ్" రాష్ట్రాలు 1 వ ఛార్లసు ఎమాన్యుయలు అధికారంక్రింద క్రమంగా అభివృద్ధి పొందుతూంది.

ఈ శతాబ్దంలో ఇటలీ కేవలం నిద్రపోతూన్నదని చెప్పడానికి వీలులేదు. యూరపురాజ్యాల పోరాటంలో ఇటలీ తనజాతీయాభిమానాన్ని పురికొలుపుకుంటూందని చెప్పకతీరదు. అనేకమంది దేశభక్తులు దేశాన్ని పరరాజాక్రమణనుంచి తొలగించడానికి విశ్వప్రయత్నాలు చేస్తూనే యున్నారు.

17వ శతాబ్దంలో ఆస్ట్రియా సామ్రాజ్యాన్ని సంపాదించి యూరపులోని పెద్దశక్తులలో ఒకటయింది. 1713లో స్పెయిన్ నుంచి "మిలన్ మాంటు" అలని లాగుకుంది. 1737 టస్కనీ ఆస్ట్రియనులచేతిలో పడింది. క్రమంగా నేపిల్సు మినహాగా మిగిలిన ఇటలీలోని స్పెయిన్ రాజ్యభాగాలు ఆస్ట్రియా వశం చేసుకుంది.

ఇప్పుడు ఇటలీ జాతీయవాదులు నలుగురైదుగర శక్తుల నెదురిచవలసి వచ్చింది.

ఈపరిస్థితులలో "నెపోలియన్" తెరమీాదికివచ్చేడు. ఆస్ట్రియాని ఒక్కొక యుద్ధంలోనే తరమికొడుతూ ఆల్ప్స పర్వతాలు దాటి ఇటలీని తనచేతిలోనికి తెచ్చుకున్నాడు.

వాటర్లూ యుద్ధంలో నలుగురూ "నెపోలియన్"ను సాయంపట్టేసి, విజితదేశాలని పంచుకుందుకు "వియన్నా"లో చేరేరు. ఇక్కడ నొక సంధి జరిగింది. దానినే వియన్నా సంధి అంటారు. ఈసంధిలో సార్డీనియాకు శావోయి ప్రాంతంకలిపి ఒకభాగంవిడదీశారు.

వెనిసురిపబ్లిక్ - లాంబార్డుప్రాంతం-ట్రీస్టీ-ఇస్ట్రియా - మిలన్‌లు - ఆస్ట్రియా అధికారంలోకిచ్చేరు. పోపుమధ్య ఇటలీ లోనామకః అధికారియైనాడు. నేపిల్సు - సిసిలీ - టస్కనీ- మొడేనా-ఫార్మా-లూకాలమీాద స్పెయిన్‌కి పరపతి యుంచ బడింది.

ఇటలీ పేరు మాత్రంకే. ఒక్కపీడ్మాంటే శావోయి కుటుంబము చేతిలోకాస్త స్వాతంత్ర్యం అనుభవిస్తూంది. దీని ముఖ్యపట్టణము "ట్యూరిన్" ఇటలీలో జాతీయవాదుల ప్రచారంకి కేంద్రంగా ఉండతగినది దొక్కటే కనిపిస్తూంది. 1814లో జినోవాను పీడ్మాంటుతో కలవడంతోటే జాతీయ వాదుల కార్యక్రమంనిజంగా ఆరంభం అయిందని చెప్పవచ్చు.

వియన్నా కాంగ్రెస్ జరిగిన 40 సంవత్సరాలవరకూ "ఆస్ట్రియా" చక్రవర్తిపై తిరుగుబాట్లు చేయుటలో ఇటలీ పూర్తిగామునిగిఉంది. విప్లవకారుల కేంద్రం పీడ్మాంటే. సార్డనియామంత్రి కావూరు ఇటలీ జాతీయవాదుల ఉత్సాహప్రోత్సాహాలిచ్చుసాగేడు. మాజినీతనరచనలతో ఇటలీని రెచ్చగొట్టసాగేడు. గారిబాల్డి తన సేనానాయకత్వమున శత్రువులనెదిరింపసాగేడు.

మేజినీ 1831 లో "తరుణఇటలీ" సంఘాని స్థాపించి ప్రచారంచేసి 1848 లో లంబార్డి - వెన్నినులలో విప్లవం లేపేడు పీడ్మాంటునుంచి విప్లవకారులకు సాయంవెళ్ళింది. కాని నోవారాలో పోపుసాయమునకు వెల్లిన ఫ్రెంచిసేనలు పీడ్మాంటుసేనలని పూర్తిగా ఓడించినాయి. నాయకులైన మేజినీ - గారిబాల్డీలు రోముకు పారిపోయారు. అక్కడనుంచి మరల పదేశములకు పారిపోయారు. విప్లవము చాలా భయంకరముగా అణచివేయబడింది.

అప్పుడు పీడ్మాంటు మంత్రి క్రొత్తఎత్తుఎత్తేడు. 1859 లో ఫ్రాన్సుతో ప్రత్యేకసంధిచేసికొని వారిసేనల సాయముతో ఆస్ట్రియాపై యుద్ధంప్రకటించి మే 20 నీ "మాంటిబెల్లో"లో-మే 31నీ పాలెస్ట్రోవద్ద, జూన్ 4నీ మిాగెంటావద్ద జూన్ 24 నీ సాల్ఫరినోవద్ద వారినోడించి తరిమివేసేడు. ఈస్థితులో జాతీయవాదులు ఫ్లారెన్సు - పార్మా. మొడేమాలలో

విప్లవం లేవదీసేరు. అక్కడి ప్రభుత్వాలు ధ్వంసంచేయ బడ్డాయి. పోపురాష్ట్రం అంతా విప్లవానికి చేయూత ఇచ్చింది.

ఈ పరిస్థితులలో నెపోలియన్ (ఫ్రాన్సుచక్రవర్తి) ఆస్ట్రియాతో సంధి కలిపేడు. కావూరు ఒకచిన్న రాష్ట్రం(లంబార్డీ) తో సంధి పత్రంమీద సంతకంపెట్టేడు. యుద్ధానికిపూర్వం ఉన్నట్లే మరల ఇటలీ రాష్ట్రాలెవరివి వారికిచ్చివేయబడినాయి. దీనితో జాతీయవాదులు తీవ్రముగా ఆందోళనంచేశారు. కావూరు తనపదవికి రాజీనామా నిచ్చేడు.

గారిబాల్డీ దేశం అంతటా విప్లవం లేవదీయడం ఆరంభించేడు. టస్కనీ ప్రభువీ ప్రబోధంకి లొంగి రాజ్యం విడిచేడు. తరువాత టస్కనీ - మొడేనా - పార్మా - రొమాగ్నా ప్రభుత్వాలు ఒడంబడికలు చేసుకొని పీడ్మాంటుతో కలియడానికి తీర్మానించేయి. రాజకీయంగా కలియకపోయినా, ఆర్థికంగానైనా ఇవన్నీ కలిసి ఒకటైనాయి.

## ౫

మరల "కావూరు" మంత్రిపదవికి ఆహ్వానించబడి నాడు. పార్మా - మొడేనా. రొమాగ్నా, మార్చెస్, టస్కనీ, రాష్ట్రాలప్రజల ఇటలీ ఐక్యతకు ఓటునిచ్చేరు. దానితో ఫ్రెంచి సేన లిటలీనుంచి లేచి పోయినాయి.

గారిబాల్డీ కీసమయంలో పీడ్మాంటు సేనలలో ఉద్యోగం ఈయబడిందిగాని 1859 నవంబరులో దానికి రాజీనామా నిచ్చివేసి, తన వేయిమంది యనుచరులతో "జినోవా"లో బయలుదేరి "సిసిలీ"లో ప్రవేశించి అచ్చటి ప్రభుత్వసేనలని తరిమివేసి, "వారినో" ద్వీపంవశంచేసుకొని డిక్టేటరు పదవి తీసుకున్నాడు. తరువాత రిగ్గియో, నేపిల్సులు వశంచేసుకొని రాజును తరిమివేసెను.

ఈస్థితిలో పీడ్మాంటు చేతులుముడుచుకొని యుండలేదు. 1860 సం॥ము సెప్టెంబరు 11వ తేదీన పీడ్మాంటు సేనలు "పాపెలు" వరగణాప్రవేశించి 18వ తేదీన "కాస్టల్ ఫిడారో" వద్ద పోపుసేనలతరిమి 29వ తేదీన అంకోనా ఆక్రమించేయి.

అక్టోబరు 4 న విక్టర్ ఎమాన్యుయల్ పీడ్మాంటు సేనల ఆధిపత్యంతీసుకొని 15 వ తేదీన నేపిల్సునకు బయలుదేరెను. కాని ఆనెల 1 వ తేదీనే గారిబాల్డీ నేపిల్సు నాక్రమించి యుండుటచే రాజు శ్రమపడనవసరములేక పోయింది. కాని

ఎమాన్యుయల్ 17 వ తేదీన నేపిల్సుయొక్క మిగిలిన బలాన్ని గూడ "వాల్టర్నో"వద్దనోడించి 26 వ తేదీన నేపిల్సు గారిబాల్డీ సహాయమున ప్రవేశించేడు.

అక్టోబరు 21 న సిసిలీ - నేపిల్సులు ఇటలీలో కలియుటకు ఓటు నిచ్చినాయి. నవంబరు 7 తేదీన విక్టరు ఎమాన్యుఅల్ నేపిల్సులో రాజత్వము స్వీకరించేడు.

తరువాత "గైటా" లో దాగియున్న నేపిల్సు రాజును పట్టుకొనుటకు పీడ్మాంటు సేనలు, నేలమీద- నీటిమీద కూడ దానిని ముట్టడించినాయి. ఫ్రెంచి నౌకాసైన్యము "గైటా" రక్షణకు పరుగెత్తుకొని వచ్చినాయి. కాని 1861 జనవరి 19వ తేదీన పూర్తిగా ఓడిపోయినాయి. రెండవ ఫ్రాన్సిస్ రోము నకుపోయేడు. గైటా పట్టుబడిపోయింది.

ఫిబ్రవరి 18 వ తేదీన ట్యూరిన్‌లో మొదటి ఇటలీ పార్లమెంటు సమావేశమై విక్టర్ ఎమాన్యుయల్‌ను ఇటలీకి రాజుగా ప్రకటించింది. మార్చి 31 వ తేదీన ఇంగ్లాండు ఇటలీ యొక్క స్వాతంత్ర్యాన్ని అంగీకరించింది. జూన్ 24 న ఫ్రాన్సుకూడ తన సమ్మతి చూపింది. అప్పటికి కావూరు చనిపోయి 18 రోజులుమాత్రమే అయింది. ఫ్రెంచి రాజుగారియొక్క సమ్మతిని గూర్చి వినకపోయినా, ఆమహాత్ముడు ఇటలీ స్వాతంత్రం అయింది అనే విషయం చూశాడు.

౬

పోపు ఈ ఏర్పాట్లకు మాత్రం అంగీకరించలేదు. రోము ఇటలీలోనుంచి మినహాయిస్తే ఇటలీకి వ్యక్తిత్వం ఏది? కాని పీడ్మాంటు ప్రభుత్వం రోమునుకదల్చడానికి భయపడ్డది ఫ్రెంచివారికి భయపడి. 1864 లో ఇటలీకి ప్లారెన్స నగరం రాజధానిగా మార్చబడింది.

రోమును రాజ్యాధికారంలోకి తీసుకురాకపోవడం గారిబాల్డీకి సహ్యంకాలేదు. ఆతడు సిసిలీ ప్రవేశించి "మార్సలా" లో వలంటీర్లసిప్రోగుచేసి రోము మీాదకి దండయాత్ర సాగింపదలపెట్టేడు. "ఆస్ప్రిమాంటీ" వద్ద ఇటలీ జాతీయసైన్యాలాతనిని నిర్బంధించి క్షమించి వదలివేశారు.

186t లో ప్రష్యా-ఆస్ట్రియాల మధ్య యుద్ధం బయలుదేరింది. అదివరకు చేసుకున్న సంధిప్రకారం ఇటలీ ప్రష్యాతో చేరింది.

ఈ యుద్ధంలో ఇటలీసేనలు పూర్తిగా ఓడిపోయినా-ప్రష్యాకే జయంకలగడంచేత విపరీతాలు కలుగలేదు. యుద్ధాంతమున వియన్నాలో సంధి జరపబడింది. "వెనీషియా" రాష్ట్రానికి ఈ సంధి స్వాతంత్ర్యం ప్రసాదించింది.

అచటి ప్రజల సమ్మతిప్రకారం 1866 అక్టోబరు నెలలో వెనీషి యా సామ్రాజ్యంలో చేర్చుకోబడింది.

1867 మొదలు రోమను పరగణాలలో గారిబాల్డీ-మాజినీలు విప్లవం దరికోల్పడం అరంభించేరు. ఇటలీ ప్రభుత్వం ఇతర యూరపు ప్రభుత్వాలభయంచేత ఎంత ఆపినను ఆగక సరిహద్దులనుదాటి పోపుసైన్యముల నోడించి, మాంటీ రోటాండో పట్టుకున్నాడు.

పోపుఫ్రెంచిరాజును సాయంకోరేడు. ఆతడు వచ్చేడు. వారు వీరు కలసి గారిబాల్డీని మెంటానావద్ద ఓడించేశారు.

చేయునదిలేక జాతీయ నాయకులు రోమునాక్రమించుకొనడానికి ఒడుపువేసి కూర్చున్నారు.

ఇంతలో ఫ్రాంసుకు- ప్రష్యాకు యుద్ధం తటస్థించింది 1870 లో. అంతవరకు పోపుసాయంకోసం ఉన్న ఫ్రెంచి సేనలు యుద్ధభూమికి తరలిపోయేరు.

ఫ్రాన్సుసేనలు యుద్ధంలో చిక్కుకోగానే ఇటలీసేనలు సరిహద్దులుదాటి రోముమీదకు బయలుదేరి 1870 సెప్టెంబరు 12 వ తేదీన పిటర్బోచవద్ద పోపు సేనలను తరిమి ఆనెల 20 వ తేదీనాటికి రోమునాక్రమించుకొన్నాయి. అక్టోబరు 2 వ తేదీన ప్రజల ఓట్లుతీసుకొనబడి రోముపరగణా ఇటలీలో చేర్చివేయబడినది. ఆసంవత్సరమే డిసెంబరునెలలో 5 వ తేదీన రోమునగరము ఇటలీకి రాజధానిగా ప్రకటించబడింది.

చివరకి జాతీయవాదుల చిరకాలపుకోరిక నెరవేరింది. వియన్నా కాంగ్రెసులో యూరపురాష్ట్రాలు ఇటలీని పంచుకొన్న ఏబదియైదేళ్ళకు అది తిరిగి నైక్యతను స్థాపించుకొంది

ఈ మధ్యకాలంలో ఇటాలియనులు, ఫ్రెంచిసేనలుచేత ఆస్ట్రియనులచేత - స్పెయినువారిచేత నోడనడంకన్న వారు పెద్దచేసిన అధికారానికి తెచ్చుకొన్న పోవుచేతులలోనే ఓడి బాధపడ్డారనడం నిజం!

ఇటలీకూడా ఇతర యూరపురాజ్యాలకువలెనే. ఇతర ఖండాలలో వలసరాజ్యాలేర్పాటు చేసుకొనడానికి బ్రహ్మాండ ప్రయత్నాలుచేసింది. వారి దృష్టి రోమకసామ్రాజ్యకాలము నుంచీ ఆఫ్రికామీదనేయుంది. 1885 లో ఒక వర్తకసంఘము:తో ఇటలీ దేశంకొందరిని "మసావా"కి పంపింది. 1888లో నెమ్మదిగా దేశీయులతో గిల్లి కజ్జాపెట్టుకొని ఆప్రాంతం ఆక్రమించుకొని ఇరిట్రియావరగణా చేతులలోనికి తెచ్చుకుంది.

రెండవది ఇటాలియను సోమాలీలాండు. ఈ ప్రదేశానికి అబ్సీనియా- కెనియా- బ్రిటిషుసోమాలీ లాండులు మూడువైపులనున్నాయి. దీనిని సంపాదించే ప్రయత్నాలలో ఇటలీకి అబ్సీనియాతో చేయి కలిపవలసివచ్చింది. "అడోవా" దగ్గర జరిగిన భయంకర యుద్ధంలో ఇటలీ సైనికపంక్తులు పూర్తిగా ధ్వంసం అయిపోయినాయి. యుద్ధరంగమున 7000 మంది ఇటాలియనులు చచ్చిపోయేరు. 1500 మంది ఖైదు చేయబడినారు. ఈపరాజయము జరిగి నేటికినలుబది ఏండ్లయినను ఇటలీ మరచిపోలేక పోయింది. నేడు ముస్సోలినీ విసిగియున్న ఇటలీదేశీయులని రెచ్చగొట్టడానికి నిరంతరం-"అడోవా ప్రతీకారం" అని అర్చుచున్నదీ యుద్ధమునుగూర్చియే.

1912 లో టర్కీనుండి ట్రిపోలీ-సిరెనైకా పరగణాలని బెదిరించి గుంజుకొంది. యుద్ధానంతరం నెగ్గింది. వంచుకొనేపద్ధతి మీాద మిత్రమండలితో సంధిచేసుకొంది కాని యుద్ధం దినాలలో అడుగడుకీ ఓడింపబడిపోవుటచేత బలహీనమైన ఇటలీకి సంధిప్రయత్నాలలో ప్రాధాన్యం ఈయబడలేదు. డాకనీజుద్వీపాలు - రోడ్సుద్వీపం- ఇటలీకికలిసినాయి. ఇస్ట్రియాకలిసింది కానిచిరకాలంనుంచి కన్నువేసిన ఫ్యూము యుద్ధంకి పూర్వం ఎంతదూరంలో ఉందో అంతదూరంగానే ఉండిపోయింది. ఇటలీ పళ్ళుకొరికింది. ఎగిరింది. కాకిపంచేస్తుంది. బలవంతములైనమిత్రరాజ్యాలని కదిల్చేశక్తిదానికిలేదు.

వేలకొలది సంవత్సరాలు విప్లవాలని నడిపించింది. అనేకనాయకుల చేతులలో - రాజుల చేతులలో నలిగింది. మారింది. ప్రపంచంలో ఒక స్థానంపొందటానికి బ్రహ్మాండప్రయత్నాలుచేసింది. కాని ఇటలీ ఒక్క అడుగుముందుకు వచ్చిందా?

లేదు. ఇటలీ బయలుదేరిన చోట్లోనే ఉండిపోయింది.

కారణం?

# విశ్వసాహిత్యమాల.

మిక్కిలి చౌకలో ఉత్తమోత్తమ గ్రంథాలు ప్రక టించడానికి సాహసించిన గ్రంథమాల ఒక్క ఆంధ్రదేశానికే గాదు - హిందూదేశాని - కంతటికీ ఇది ఒక్కటే!

600 పుటలు గల ౪ పుస్తకాలు

పోస్టేజీతో 1-4-0

*            *            *

# నియమాలు.

౧. ప్రతిమనిషికీ - దేశంకీ - జాతికీ - విజ్ఞానం - సంస్కారం కలిగించే పుస్తకాలే ఏర్చి కూరుస్తాము.

. వివిధదేశాలసాంఘిక - ఆర్థిక - రాజకీయచరిత్రలు - మహాపురుషుల జీవితచరిత్రలు - వివిధరాజ్యాంగ తత్త్వాల్ని గురించిన గ్రంథాలు - తేట తెలుగులో ప్రకటించుతాము.

౨. చందాదార్లకి గ్రంథములు పోస్టేజీ కూడ మేమే భరించి అందచేస్తాము.

సంవత్సరములో ప్రకటించే ఆరువందలవుటలు నాలుగు పుస్తకాలుగా చందాదారుల కందచేయ బడతాయి.

3. చందాదార్లకి ప్రవేశరుసుంలేదు.

సంవత్సరానికి చందా (రూపాయి నాలుగణాలు) మొట్టమొదటనే చెల్లించివేయాలి.

వి. పి. లు చేయజాలము.

౪. గ్రంథమాల తరఫున అప్పుడప్పుడు ప్రచురించబడే అనుబంధగ్రంథాలు మా చందాదార్ల కుచితముగా లభ్యం అవుతాయి.

చందాదారులు కాని వారికి అమ్మబడవు!

ఇంతకంటె సరసమైన నిబంధనలుగల గ్రంథమాల దొరకదు.

ఆంధ్రులెల్లరు

త్వరపడి చందాదారులుగా చేరండి!

*   *   *

విశ్వసాహిత్యమాల. ౧.

రెండవమారు) (కూర్పబడుతూంది.

# లియో టాల్‌స్టాయి.

(మహీధర రామమోహన్ రావు)

టాల్‌స్టాయి మానవహృదయ మరసిన మహాత్ముడు. ప్రపంచరహస్యము దెలిసిన దార్శనికుడు. కళామర్మము లెరిగినకవి. ఆమహాత్ముని జీవితము నెరిగియుండుట ప్రతిమనిషికి అవసరం. అతని ఆదర్శం ఒకజాతికి మాత్రమే ఉపయోగించేది కాదు. అతనితత్త్వజిజ్ఞాస ఒక్కదేశానికే పనికివచ్చేదికాదు. సులభమైన సుందర వ్యావహారిక భాషలో వ్రాయబడి అనేకుల మెప్పుపొందినది. మొదటికూర్పు ప్రకటించబడిన నాలుగునెల లకే చెల్లిపోయినదనిన ఈగ్రంథప్రాశస్త్యం చెప్ప బనిలేదు.

రెండవకూర్పులో అతని జీవితము వివరముగా చాలా విషయములు చేర్చబడి ఏడెనిమిది చిత్రపటములతో సుందరముగా ముద్రించబడుతూంది.

300 పుటలు గల గ్రంథం 12 అణాలు

మాచందాదారులకి- 8 అణాలే పోస్టేజీతోకూడ

# విశ్వసాహిత్యమాలా

## బుక్ డిపో.

మాగ్రాహకుల సౌకర్యంకొఱకై మేమొక పుస్తక విక్రయశాలని, దానికనుబంధంగా ఒక ప్రదర్శనశాలనికూడ తెరిచేము. పుస్తకాల మంచి చెడ్డలు స్వయంగా చూసుకొనడానికీ - స్వల్పమైన ఖర్చులతో తెప్పించుకొనడానికీ ఆంధ్ర మహాజనుల కవకాశం కల్పించడమే మా ఉద్దేశ్యం!

ఆధునికాంధ్రకవుల గ్రంథాలన్నీ ఒకేచోటప్రదర్శిం చడంలోగల ఉపయోగం అధికం. నేడు పల్లెటూళ్లలో తెరువ బడుతూన్న గ్రంథాలయాలు - ఆధునికాంధ్రసాహిత్యం అంతా ఒక్కచోట దొరకకుండడంచేతను, పోస్టేజీఖర్చులు అసలును మించి పోతూండడంచేతను, పుస్తకాలమంచిచెడ్డలు తెలియక పోవడంచేతను - పురాతనగ్రంథాలతోనే అర్థ సంతృప్తిపొంది ఊరుకుంటున్నాయి. గ్రంథకర్తలు తగు ప్రోత్సాహం పొందకుండడానికి కారణం ఇదే!

అట్టివారల సౌకర్యములకొఱకై మేమీ 'బుక్ డిపోను' తెరచినాము. దీనివలన ఆంధ్రమహాజనుల కేమాత్రమైన సేవచేయగలుగుచో ధన్యులము!

ప్రతికవి ప్రతిపౌరుడు మా "బుక్ డిపో - ప్రదర్శనశాల" సౌకర్యము నుచితంగా పొందవచ్చు.

కాని మా ప్రదర్శనశాల ప్రతిపల్లెటూరునకు త్రిప్పబడునదగుటచే కవులు - గ్రంథ ప్రకాశకులు మాత్రం కొన్ని విషయాలు గమనించాలి.

౧. మాకు విక్రయానికి పంపే ప్రతిపుస్తకానికి ఒక ప్రతి ఉచితంగా మాప్రదర్శనశాల కీయాలి.

ప్రదర్శనశాలకి ప్రతి పంపనిదే గ్రంథకర్తలకు మేము సాయంచేయలేము.

౨. విక్రయసౌకర్యంకోసం ప్రతిపుస్తకం 6 ప్రతులకి తక్కువ కాకుండా మా కార్యాలయానికి పంపాలి.

ఈనిబంధనలకి లోబడి పుస్తకాలు పంపించేవారిగ్రంథాలని - మాగ్రంథాలలోను - విడిగానుకూడ ప్రకటించి విక్రయించుతాము. ప్రతి ఆరు నెలలకీ ఒక్కొక్కమారు విక్రయధనము $1/_3$ కమీషన్ మినహాయించుకొని పంపుతూఉంటాము.

ప్రదర్శనశాలఖర్చులకే కమీషన్ తీసుకోబడుతూంది!

మాప్రకటనలువేసే పత్రికలను మాగ్రంథమాల పుస్తకాలలో ఉచితంగా ప్రకటిస్తాం......

# విశ్వసాహిత్యమాలా బుక్ డిపోలో

## దొరకు పుస్తకములు.

హిందూదేశము: క్రైస్తవ ప్రభుత్వ నిర్మాణతత్త్వము.
రచయిత: బి.డి.బసు.
అను: మహీధర జగన్మోహనరావు
౨౦౦ పుటలు ఉత్తమప్రతి. 0-8-0

జగత్కథ.
రచయిత: హెచ్. జి. వెల్సు.
అను: కొమాండూరి శఠకోపాచారి గారు ౯00 పుటలు.
క్యాలికోబైండు. 3—0—0

గర్భిణీరోగములు.
రచయిత: లంకరామారావుగారు.
౨౫౦పుటలు క్యాలికో 0—12—0

వైద్యమిత్ర.
రచయిత: లంక రామారావుగారు.
౨౫౦పుటలు క్యాలికో 0—12—0

గాంధిమహాత్ముని లండను ఉపన్యాసములు. (రెండవ రౌండు టేబిలు సమావేశములోనిది) రచయిత: తిమ్మరాజు సత్యనారాయణగారు
౨౨౫పుటలు: గ్లేజుప్రతి 1-0-0

హరిజనసమస్య.
రచయిత: నండూరి కృష్ణమాచారి గారు. ౩౨౫ పుటలు
సాదాప్రతి. 1—0—0

ఆధునికరాజ్యాంగ సంస్థలు. (౧-వ భాగం) రచయిత: ప్రొఫెసర్ రంగాగారు ౩-౨౫ పుటలు.
గ్లేజుప్రతి. 1—0—0

ఆధునికరాజ్యాంగసంస్థలు.
రచయిత: ప్రొఫెసర్ రంగాగారు ౩00 పుటలు గ్లేజుప్రతి 1—0—0

రాజ్యాంగవివేకము. (చరిత్రదీపిక)
రచయిత: రెబ్బాప్రగడ మందేశ్వర శర్మగారు. ౩౫0 పుటలు.
గ్లేజుప్రతి, 1—0—0

వైశాఖి.
౧౭౫ పుటలు. ఫెదర్వైటు ప్రతి. 1—0—0

తెనుగుతోబుట్టువులు.
రచయిత: కవిగారు.
౧౩0 పుటలు గ్లేజుప్రతి 0—8—0.

కవిగారిమనుగడ.
రచయిత:జయంతి సుబ్బారావుగారు
౧౨౦ పుటలు ఉత్తమప్రతి. 0-8-0

ఉత్కళపతనము.
రచయిత:పురిపండా అప్పలస్వామి
గారు ౧౨౫ పుటలు
సాదా ప్రతి. 0—8—0

ప్రభవ.
రచయిత: శ్రీరంగం శ్రీనివాసరావు
గారు ౬౦ ప్రతులు.
గ్లేజుప్రతి 0—8—0

బాష్పబిందువు.
రచయిత: వెంకట కాళిదాసుకవులు
౬౦ పుటలు ఫెదర్వైటుప్రతి0-8-0

చాకిరేవు.
రచయిత: కొల్లూరి ధర్మారావు గారు
౬౦ ఫెదర్వైటుప్రతి 0—8—0

రత్నార్పణం.
రచయిత: కీ.శే. పెనుమర్తి వెంకట
రత్నంగారు ౧౨౫ పుటలు.
గ్లేజు ప్రతి. 0—8—0

గారిబాల్డీ.
రచయిత: శరణు రామస్వామి చౌ
దరిగారు. ౧౫౦ పుటలు
గ్లేజు ప్రతి. 0—8—0

చిత్రకథామంజరి. (భా. ౧.)
రచయిత: రాయసం వెంకటశివుడు
గారు ౧౩౦ పుటలు.
గ్లేజు ప్రతి. 0—12—0

చిత్రకథామంజరి. (భా. ౨,)
రచయిత: రాయసం వెంకటశివుడు
గారు. ౨౦౦ పుటలు.
గ్లేజు ప్రతి, 0—12—0

కమలాక్షి.
రచయిత: రాయసం వెంకట శివుడు
గారు. ౨౦౦ పుటలు.
సాదా ప్రతి. 0—8—0

రాజేశ్వరి.
రచయిత: రాయసం వెంకట శివుడు
గారు ౧౧౦ పుటలు.
సాదా ప్రతి 0—8—0

వీరేశలింగ సంస్మృతి.
రచయిత: రాయసం వెంకటశివుడు
గారు ౧౬౧ పుటలు.
గ్లేజు ప్రతి. 0—8—0

ఆత్మజ్యోతి.
రచయిత: ముద్దా విశ్వనాధంగారు.
౧౨౫పుటలు గ్లేజుప్రతి 0-7-0

ఆత్మచరిత్రము.
రచయిత: వెంకటశివుడుగారు

౨౦౦ పుటలు అట్టబెండు
గ్లేజు ప్రతి 1—0—0

శతకకవులచరిత్రములు (భా. ౧.)
రచయిత: కీ. శే. పండిత వంగూరి సుబ్బారావుగారు ౨౨౫ పుటలు
గ్లేజు ప్రతి. 1—8—0

శతకకవులచరిత్రములు. (భా. ౨.)
రచయిత: కీ. శే పండిత వంగూరి సుబ్బారావుగారు. ౨౭౪ పుటలు
గ్లేజు ప్రతి 1—8—0

వేమన.
రచయిత: కీ. శే. పండిత వంగూరి సుబ్బారావుగారు. ౨౧౫ పుటలు
గ్లేజు ప్రతి. 1—4—0

ఆంధ్రక్షత్రియులు.
రచయిత: కీ. శే. పండిత వంగూరి సుబ్బారావుగారు. ౧౩౦ పుటలు
ఆంటిక్ ప్రతి. 1—0—0

లలితకుమారి.
రచయిత: కీ. శే. పండిత వంగూరి సుబ్బారావుగారు. ౧౫౦ పుటలు
గ్లేజు ప్రతి 0—15—0

ప్రభాతము.
రచయిత: కీ. శే. పండిత వంగూరి సుబ్బారావుగారు ౧౭౫ పుటలు
గ్లేజు ప్రతి 0—12—0

మణిమేఖల.
రచయిత: కీ. శే. పండిత వంగూరి సుబ్బారావుగారు ౧౦౦ పుటలు
గ్లేజు ప్రతి 0—12—0

కథారత్నాకరము.
రచయిత: కవిగారు ౧౬౦ పుటలు
గ్లేజు ప్రతి 0—10—0

తూలిక.
రచయిత: ముద్దా విశ్వనాధంగారు ౧౫౦ పుటలు గ్లేజు ప్రతి 0—6—0

సంధ్య.
రచయిత: ముద్దా విశ్వనాధంగారు. ౧౦౦ పుటలు గ్లేజు ప్రతి 0—6—0

పూలమాల.
రచయిత్రి: సానాపతి రుక్మిణమ్మగారు ౪౦ పుటలు గ్లేజు ప్రతి 0—4—0

జమీందారురైతుసమస్య.
రచయిత: రెబ్బాప్రగడ మందేశ్వర శర్మగారు ౬౦ పుటలు
గ్లేజు ప్రతి 0—4—0

స్వాతంత్ర్యమెవరికోలకు?
రచయిత: జవహారిలాల్ నెహ్రూ. ౪౦ పుటలు గ్లేజు ప్రతి 0—2—0

మాతృపూజ.
ప్రసిద్ధులగు కవుల జాతీయ రచనలు. ౪౦ పుటలు గ్లేజు ప్రతి 0—4—0

మహామేధావులు.

రచయిత: గొబ్బూరి వెంకటానంద రాఘవరావు గారు. ౧౨౫ పుటలు

గ్లేజుప్రతి. 1—0—0

నక్షత్రములు.

రచయిత: గొబ్బూరి వెంకటానంద రాఘవరావుగారు. ౨౫ పుటలు

సాదాప్రతి 0—4—0

ఆంధ్రవాచస్పత్యం.

రచయిత: కొట్ర శ్యామలకామశాస్త్రిగారు. ఆంధ్రభాషలో ప్రచలితములై యున్నట్టి లక్షశబ్దములకు పైగా అర్థము, పూర్వకవి ప్రయోగములు, పర్యాయపదానుక్రమణికలతోసహా వివరింప బడినది. తెనుగు సందిట్టి నిఘంటువు పుట్టి యుండలేదు. పెక్కుమంది పండిత ప్రకాండులనుంచి అభిప్రాయముల సంపాదించినది. మొత్తము పుటలు ౫౦౦ గ్లేజుప్రతి. 15—0—0

ఆచ్చులుగలసంపుటము ౭౦౦ పుటలు. 5—0—0

కాంగ్రెస్ నాయకత్వం 0—0—3

స్వరాజ్యంకోసం కాంగ్రెస్ నాయకత్వం ... ... 0—0—3

ధనప్రభావం... ... 0—0—6

రక్షాబంధనం.

రచయిత: శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి గారు ౪౦౦ పుటలు 1—0—0

శ్మశానవాటిక.

రచయిత: శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి గారు గ్లేజు ౨౧౭ పుటలు 0—12—0

వారకాంత.

రచయత: శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి గారు. ౧౨౦ పుటలు 0—12—0

పూలదండ (భా. ౧.)

రచయిత: శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి గారు. ౧౬౦ పుటలు.

అట్టబైండు. 0—8—0

# ప్రకటనరేట్లు.

మా గ్రంథమాల పుస్తకాలలో ప్రకటనలు వేయువారు తమ పెట్టుబడికి మించిన లాభం పొందగలరు. ఏమంటే-

౧. మా గ్రంథమాల గ్రంథాలు ఆంధ్రదేశంలోని ప్రతిమారుమూలకి వ్యాపింపచేయ బడుతున్నాయి—

౨. మా పుస్తకాలు ప్రతివానికి అందుబాటులో ఉండునట్లు చాలతక్కువ ఖరీదుల పెట్టబడినాయి.

౩. మా పుస్తకములవలెనే మా ప్రకటనరేట్లుగూడ చాలచవుక-ప్రకటనలు వేయువారికింతకన్న మంచి అవకాశం దొరకదు.

| | పూర్తిపేజీ. | అరపేజీ. |
|---|---|---|
| ఒక్కమారునకు | 6—0—0 | 3—0—0 |
| సం॥నకు | 20—0—0 | 12—0—0 |

గ్రంథమాలలకు - పత్రికలకు-పుస్తకవిక్రయ శాలలకు ప్రత్యేకపు రేట్లు.

వివరాలకి వెంటనే.

విశ్వసాహిత్యమాల.
ముంగండ.
(Via) అంబాజీపేట. తూ. గో. జిల్లా.

రామమోహన్ ప్రెస్, రాజమండ్రి-1936.

20



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA104B148 |
| పుస్తకం పేరు | జెట్లీ |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 113 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 12,82 |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Navya |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |